

Chandamama, June '49

Photo by K. Muthuramalingam

స్నేహం

జూ౯ **3** తేదిన
మద్రాసులో క్రౌ౯ & స్టార్‌లోను
ఆంధ్రదేశ ముఖ్య కేంద్రాలలోను విడుదల!



శ్రీ రాజరాజేశ్వరీ ఫిలిం కంపెనీ వారి

# నవజీవనం

(తమిళం)

నాగయ్య, కన్నాంబ, యస్.వరలక్ష్మి, శ్రీరామన్.
టి.ఎ.జయలక్ష్మి, టి.ఆర్.రామచంద్రన్, యల్.నారాయణరావు

డైరెక్షన్.- కె.బి.నాగభూషణం

# చందమామ

ఈ సంచికలో యివి

చదువుకోండి



ఇవన్నీగాక పజిలు, ముగ్గులు, చిక్కుచదరాలు, చిక్కుబొమ్మలు, ఇంకా, ఇంకా ఎన్నోవున్నై.

**చందమామ ఆఫీసు**
పోస్టుబాక్సు నెంబరు. 1686
మద్రాసు. 1.




# ఉరుకులు, పరుగులు

మీ పిల్లలకు చక్కటి దుస్తులు కొనండి. వాళ్ళు బళ్ళో ముచ్చటగా అగుపడేట్లు చూడండి. వాళ్లు బళ్ళోను ఆటపాటల్లోను ఇంట్లో కట్టుకునేందుకైనా, బయటికి వెళ్ళేటప్పుడు కట్టుకునేందుకైనా, అచ్చటకైనా ముచ్చటకైనా ఆటపాటల తొక్కిడి కాగేందుకైనా కో ఆప్టెక్స్ దుస్తులు రకరకాలవి ఉన్నవి. మీ పిల్లల్ని మా సేల్సు ఎంపోరియంకు తీసుకెళ్ళి వాళ్ళకు నచ్చిన రంగులను, మాదిరీలను వాళ్లనే ఎన్నుకోనివ్వండి. ప్రస్తుతపు తగ్గింపు ధరల అవకాశాన్ని పొందండి.

## కో ఆప్టెక్స్

చేనేత వస్త్రాలలో నాజూకైనవి

మద్రాసు హేండ్‌లూం వీవర్సు ప్రావిన్షియల్
కో-ఆపరేటివ్ సొసైటీ, లిమిటెడ్.,
'హేలోవేస్ గార్డెన్సు' 34, షాంతియన్ రోడ్డు, ఎగ్మూరు, మద్రాసు.

# హిందీ చందమామ

## ప్రథమ సంచిక



ఎంతో ఆకర్షవంతంగా

ఎక్కువ పేజీలతో

## 20, జూన్ 1949 న వెలువడుతుంది



విడిసంచిక **0—8—0**

జూన్ మాసంలోపల చందాదారులుగా చేరువారికి

సాలు చందా రు. **5-** మాత్రమే

నేడే చందాదారులుగా చేరండి



## ప్రతిచోటా ఏజంట్లు కావాలి

యూ. పీ, సీ, పీ., బీహార్, రాజస్థాన్, ఉత్తర పంజాబ్ ప్రదేశాలకు జిల్లావారీగా ఏజంట్లు కావాలి. ఏజంట్లకు మంచి కమిషన్ యివ్వబడును.

ఏజన్సీ నిబంధనలకొరకు నేడే వ్రాయండి.

---

## చందమామ పబ్లికేషన్సు

పోస్టుబాక్సు నెం. 1686. మదరాసు-1.

# అట్టమీది బొమ్మ

చిన్నారి కృష్ణుడు గోకులంలో నందుని ఇంట పెరుగుతూ వున్నట్టు చెప్పాముకదా! ఒక యేడు వచ్చినకొద్దీ, కృష్ణుడు బుద్ధిమంతుడు కావటానికి బదులు పెంకెవాడుగా మారిపోతున్నాడు. అతను చేసే చిలిపి చేష్టలకూ అగడాలకూ అంతూ పొంతూ లేకుండా వుంది.

గోకులంలో గోపికలు, సరీగా పాలు పిదుకుకొనేవేళకు పోయి కృష్ణుడు లేగలను విడిచిపెట్టివేస్తాడు. అతను తనవెంట కోతిమూకను వెంటబెట్టుకు వెళ్లి గోపికలు దాచుకొన్న పాలు, పెరుగు, వెన్న తను తిన్నంత తిని మిగిలినది వాటికి మేపుతాడు. అవి తినకపోతే ఆ కుండలు పగులగొట్టి వేస్తాడు.

ఒకవేళ కుండలు ఎత్తున వుండి అందకపోయినట్టయితే అతను రోలు వేసుకొని ఎక్కుతాడు. లేదా, ఒకళ్ల వీపుమీద ఒకళ్ళను నిలబెట్టి కృష్ణుడు కుండలు తీసి పాలు, పెరుగు వెన్న దొంగిలిస్తాడు. గోపికలు వచ్చి తనను పట్టుకోబోతే కుండలో వెన్న తీసి వాళ్లమొహాన కొట్టి, నేలని విసిరేస్తాడు.

గోపికలందరూ కలిసి యశోదవద్దకు వెళ్ళి 'అమ్మా! నీ ముద్దుల కుమారుడు చేసే అగడాలు చూశావుటమ్మా! మమ్మలిని ఒక్కనిమిషమైన బతకనీయటంలేదు. దొంగ కృష్ణుడు! పెంకె కృష్ణుడు!!—ఇలా అయితే మేము ఎక్కడికయినా పోతామమ్మా!' అని చాడీలు చెప్పేవారు. ఇవన్నీ విని తల్లి యశోద, కొడుకుని మందలించలేక చిరునవ్వుతో 'సరే, కోప్పడతా లెండి' అని చెప్పి వాళ్ళను సద్దిపుచ్చి పంపివేసేది.




సంపుటి 4
సంచిక 6

సంచాలకుడు: చక్రపాణి

జూన్
1949

పాపాయిలూ!

చందమామకు ఈ నెలతో రెండు సంవత్సరాలు నిండినవి. జులైనించి మూడో ఏడు వస్తుంది. చందమామ మీకు ఎంత అభిమానమైనదో చెప్పటానికి ఈనాడు చందమామ కాపీలు ప్రతి నెలా **30,000** ఖర్చు అవుతున్నవంటే చాలు. ఇక ఒక్కొక్క చందమామ ఎంతమంది పిల్లలు చదువుతున్నారో చెప్పటం కష్టంగా వున్నది. కాబట్టి మీరు శ్రమ అనుకోకుండా మీ చందమామను ఎంతమంది చదువుతున్నదీ, మీ స్నేహితుల చందమామను ఎంతమంది చదువుతున్నదీ కార్డు ద్వారా తెలిపితే షుమారుగా చందమామను ఎంతమంది చదువుతున్నదీ తెలుసుకోవచ్చు. మీరు రాస్తారుకదూ!




రైలు సిగ్నలు చెంత
రావి చెట్టుందా
రావిపై నొక కాకి
బావ కూర్చుండి
వచ్చి పోయే రైలు
వంక చూస్తుంది.

*   *

రైలు రావడమున్నూ
బయలు దేరడము
గమనించి మురిసి తె
క్కలు గొట్టుకొంది.

*   *

బలగమ్ము నొకనాడు
పిలువ నంపింది;
కొట్టకొన కొమ్మపై
కొలువు దీర్చింది.

*   *

"రైలు నే రమ్మంటె
రావాలె" నంది
"పొమ్మంటె తుఱ్ఱన
పోవాలె" నంది.

అపుడు—

"గమ్మత్తు లె"మ్మంది
కాకి బలగమ్ము;
"గమ్మత్తు గా"దంటు
కాకి బావపుడు
సిగ్నలు చెక్క వం
చినది గుర్తించి,

రచన: 'ఏటుకూరి'

"రైలు రప్పిస్తాను
రం" డంటు పోయి,
"రావోయి! రావోయి!
రైలు బా" వంది.

గుప్పు గుప్పున రైలు
కూస్తు వచ్చింది;
స్టేషనులో కొంత
సేపు నిలిచింది.

ఇంతలో గార్డు విజి
లేయడ మ్మెఱిగి,
"చూడండి పంపివే
స్తున్నా"న టంటు,

"పోవోయి! పోవోయి!
పొగరాయు" డంది.
రయిలు గుబగుబ లాడి
బయలుదేరింది.

కాకి బలగము పొగడ
లేక చచ్చింది.
వినలేక చచ్చెరా?
మన కాకిబావ.

ఈలాటి రకమున
కే కాలమండి!
అందులో పక్షుల
కస లర్థమగునె!









# తాయం

[జేజిమామయ్య పాట]

ఆటలు ఆడీ పాటలు పాడీ
అలిసీ వచ్చానే!
తియ్యా తియ్యని తాయిలమేదో
తీసీ పెట్టమ్మా!

పిల్లీపిల్లా కళ్లూ మూసీ
పీటా యెక్కిందీ!
కుక్కాపిల్లా తోకాడిస్తూ
గుమ్మం యెక్కిందీ!
కడుపూలోనీ కాకీ పిల్లా
గంతూ లేస్తోందీ!
తియ్యా తియ్యని తాయిలమేదో
తీసీ పెట్టమ్మా!

* * *

గూటీలోనీ బెల్లం ముక్కా
కొంచెం పెట్టమ్మా!
చేటాలోనీ కొబ్బరి కోరూ
చేరెడు తియ్యమ్మా!
అటకా మీదీ అటుకుల కుండా
అమ్మా దింపమ్మా!
తియ్యా తియ్యని తాయిలమేదో
తీసి పెట్టమ్మా!




ఒకప్పుడు ఒక దేశమందు భయంకరమయిన బ్రహ్మరాక్షసి ఉండేది. అది భూలోకమంతా కలియ చుట్టి, దయా దాక్షిణ్యమూ లేకుండా ప్రజలనూ పశువులనూ పొట్టను పెట్టుకొంటూ వుండేది.

ఆ రాక్షసి పేరు తలుచుకుంటే చాలు జనం హడిలిపోయేవాళ్లు. ఆ భయంచేత వాళ్లు ఊరిలో మసలటమే మానుకుని, తలుపులు బిగించి ఇళ్లల్లో కూచునేవాళ్లు.

అలా వాళ్ళు ఎంతకాలమని ఉండిపోగలరు? మనుషులు సంచరించకపోతే పనులు ఎలా సాగుతయి? ప్రపంచం ఎలా నడుస్తుంది? నిజానికి ఇప్పుడు, బ్రహ్మరాక్షసి భయంవల్ల రైతు పొలందున్నటం లేదు. తోటమాలి మొక్కలు తడపడం లేదు. అందుచేత, ఎక్కడి పనులు అక్కడనే నిలిచిపోయినయి.

ఈ విధంగా, భూలోకంలో ప్రజలు నానా బాధలూ పడటం చూచి, సూర్యమహారాజుకి జాలివేసింది. ఏడు గుర్రాల రథంపైన ఆయన రోజూ వచ్చేటప్పుడూ వెళ్లేటప్పుడూ ప్రజల కష్టాలు కళ్ళారా చూచి, "అయ్యో పాపం!" అనుకుంటూ ఉండేవాడు.

ప్రజల బాధలు ఎలా అయినా పోగొట్టి, వాళ్ళకు ఉపకారం చేయాలని సూర్యమహారాజుకి మనస్సులో గట్టి నిశ్చయం కలిగింది.

మరునాడు మహారాజు, వజ్రాయుధం వంటి ఒక పెద్ద ఖడ్గాన్ని తీసి తళతళ మెరిసేట్టుగా దానికి సానబెట్టాడు. తన బాణమూ, అమ్ములపొదీ చేత పట్టాడు. 'ఈవేళ ఎలా అయినా దుర్మార్గురాలైనటువంటి ఆ బ్రహ్మరాక్షసిని చంపి,

కె. సుశీలకుమారి, అనంతపురం



భూలోకంలో ప్రజలకు మేలు చేయాలి' అని తను చేసికొన్న నిశ్చయంప్రకారం ఆచరించటానికి పూనుకొన్నాడు.

సూర్యమహారాజు తన ఏడుగుర్రాల రథంపయిన భూలోకానికి దిగి వచ్చి, ఆ రాకసికి గురిపెట్టి ఒక్క బాణం వదిలాడు. ఆ రాకసిమాత్రం సామాన్యమైందా? మహారాజుమీదకు రంకెలు వేసికొంటూ 'మింగేస్తా' నని వచ్చింది. మహారాజుకూ బ్రహ్మ రాకసికీ చాలసేపు గొప్ప యుద్ధం జరిగింది. తనవద్ద వివిధమైన ఆయుధాలు లేకపోయినప్పటికీ రాకసి, ఆయనకు చాలా కష్టం కలిగించింది.

బాణాలతో కొట్టికొట్టి, లాభంలేక చివరకు మహారాజు తన ఖడ్గం ప్రయోగించాడు. ఒక్క వేటు వేసేసరికల్లా, బ్రహ్మరాకసి తలా, మొండెమూ దేనికది విడిపోయి, నేలపైన దొరలటం ప్రారంభించాయి! మహారాజుకి ఈ యుద్ధంవల్ల చాలా అలసట కలిగింది. కాని, ఆయన దయవల్ల భూలోకంలో ప్రజలకు ఆ రాకసి పీడ వదిలి పోయింది.

అప్పుడు సూర్యమహారాజు, రాకసిని సంహరించిన బడలిక తీర్చుకోటానికని, భూలోకంలో ఒక నది గట్టున షికారుగా నడిచి వెళుతున్నాడు. కొంతదూరం వెళ్లే సరికి, ఆయనకు అపురూపమైన అందము గల ఒక కన్య కంటపడింది. "ఆహా! ఈ పిల్ల ఎంత సుందరముగా వున్నది! ఇటువంటి రూపవతి నాకు రాణి అయినట్టయితే బాగుండునుకదా!!" అని అనుకొని మనస్సులో ఉబలాటపడ్డాడు.

ఈ ఉత్సాహంతో, రెప్ప వాల్చకుండా ఆమెవేపు చూస్తూ అక్కడనే నిలబడి పోయాడు. ఆమె సౌందర్యంచూసి మురిసి పోతూ, దగ్గరగా చేరి, "చిన్నదానా!—నే నెవరినో తెలుసునా? ప్రపంచానికి వెలుగు

నిచ్చే సూర్యమహారాజుని. నాకు ఆకాశం మీద ప్రత్యేకంగా ఒక లోక మున్నది. ఆ ప్రత్యేక లోకంలో ముత్యాల తలుపులు గల కోట ఉన్నది. కోట తలుపులు తీయ టానికీ మూయడానికీ దేవకన్య లున్నారు. రోజూ నేను స్వారిచేయటానికి ఏడు గుర్రాల రథమున్నది. మరి, నాతో వచ్చేసి, నాకు రాణిగా ఉన్నావంటే నువు కోరిన సౌఖ్యాలు అనుభవించవచ్చు. వస్తావా మరి?" అని అడిగాడు.



ఆ కన్యకు అపరిమితమయిన సిగ్గు. ఇంతవరకూ ఆమె పర పురుషునితో మాటాడి ఎరుగదు. పైగా, తలిదండ్రులను కానీ, తనుండే ఇల్లుగానీ వదిలి ఎక్కడకూ వెళ్లిఉండలేదు. ఆమెకు తండ్రే దైవం. నది గట్టున గుహలో వుండే ఆ ఇల్లే ఇంద్ర లోకం. ఆమెకు తోడుగా ఆడుకోవటానికి ఉడతలు, కుందేళ్లు, పక్షులూ ఉన్నాయి. దండలు గుచ్చుకోడానికి కొకొల్లలుగా పువ్వులున్నాయి. అందుచేత, మహారాజు వేసిన ప్రశ్నకు అవుననీ, కాదనీ సమాధానం చెప్పక, ఊరుకొన్నది.

సూర్యమహారాజు 'నన్ను పెళ్లాడవలసింది. నాకు రాణిగా ఉండవలసింది' అని ఆ కన్యను ఎన్నోవిధాల బతిమాలాడు. కాని, ఆమె బదులు చెప్పలేక పారిపోయింది. మహారాజు పెద్దవాడూ, బలమయినవాడూ గనక, వెంబడించి ఆమెను కలుసుకొన్నాడు.

"చిన్నదానా! ఎందుకు పారిపోతావు? నీకు వచ్చిన భయం ఏమీ లేదు. నిన్ను ప్రాణసమానంగా చూచుకొంటాను. నువు కోరినవన్నీ ఇస్తాను. నాతో వచ్చేసి, నాకు రాణిగా ఉండు" అంటూ మళ్లీ ఆమెను బుజ్జగించి చెప్పాడు.

ఎన్నిచెప్పినా లొంగక, సిగ్గుచేత ఆమె మళ్లీ తప్పించుకు పారిపోయింది. ఏమైనా

సరేనని, మహారాజు పట్టు వదలలేదు. ఈసారి ఆయన మరింత వడిగా వెంబడించి, పట్టుకో బోయేసరికి, ఆమె భయపడిపోయి "నాన్నా! నాన్నా!!" అని పెద్దగా కేక వేసింది.

దూరాన వున్న ఆమె తండ్రి నదిరాజుకి ఈ కేక వినపడటంతోనే కూతురుకు ఏదో ప్రమాదం సంభవించి వుంటుందనుకొని, అనుమానపడ్డాడు. మానవరూపంలో ఉంటే ఇటువంటి ప్రమాదాలు తప్పవు. అందులోనూ, రూపవతి అయిన కన్యను చేపట్టడానికి ఎవరో ఒకరు చూస్తూనే వుంటారు, అనిచెప్పి తన మంత్రబలంచేత ఆమెను ఒక పొన్నచెట్టుగా మార్చివేశాడు.

ఆమె నిలబడ్డపాటున పొన్నచెట్టుగా మారిపోవటం సూర్యమహారాజుకు ఆశ్చర్యాన్ని కలిగించింది. తను ఇంతగా ప్రేమించిన ఆ కన్య, చూస్తూవుండగానే ఇలా మారిపోవడంతో సూర్యమహారాజుకు విచారంకూడా కలిగింది.

"సరే, గడచినదానికి విచారిస్తే మాత్రం లాభమేమున్నది? నీవు నాకు రాణివయి, నన్ను సంతోషపెట్టుతావని ఆశించాను. కాని కర్మవశంచేత నువు చెట్టువయిపోయినావు. అయినా, నీపయిన నాకు ప్రేమ ఎంతమాత్రమూ తగ్గలేదు. నేను ఆకాశంమీద ఉన్నంతకాలమూ నువు భూమిపయిన జీవించి ఉండవలసిందే. నా వరంచేత నీ ఆకులు వాడిపోక, ఎల్లప్పుడూ పచ్చగా వుంటాయి. మొదట రాణిగా చేసుకొని నిన్ను కోటలో పెట్టుకుందా మనుకొన్నాను. ఇప్పుడు చెట్టుగా వున్న నిన్ను, మక్కువతో నా నెత్తిమీదనే పెట్టుకుంటాను" అని సూర్యమహారాజు ఆక్షణంనించీ పొన్న ఆకులతో తయారైన కిరీటాన్నే తలపైన ధరిస్తూవున్నాడు!






బాలనాగమ్మను మాయలఫకీరు ఎత్తుకు పోయినాడన్న వార్త పానుగంటి పట్నమంతా పాక్కింది. పాత్తిళ్లలో ఉన్న పసి వాణ్ణి చూసి బాలనాగమ్మ అక్కలు, "అయ్యో, తండ్రీ! యెంత దురదృష్టవంతుడివిరా! నువు పుట్టకమునుపే నీ తండ్రులు గండికోట వెళ్లారు. నువు పుట్టగానే నీ తల్లిని మాయలవాడు చెరపట్టుకు పోయినాడు" అని ఏడిచారు.

పానుగంటి పట్నంలోనున్న కాపులూ, కరణాలూ, కమ్మ వెలమదొరలూ సభచేసి, తమకు తెలియకుండా మాయలఫకీరు వచ్చి వెళ్లినందుకు చాలా అవమానపడ్డారు. గండికోటకి కబురుపంపాలనితీర్మానించారు. కాని మనుష్యులనుపంపితే ఈకీకారణ్యాలు దాటి ఎప్పటికి పోను? అందుచేత డేగలను పైకి తీశారు. బాలనాగమ్మకు కొడుకుపుట్టాడనీ, ఏడురోజుల పచ్చి బాలింతరాలిని నాగళ్లపూడి గట్టుఏలే మాయలఫకీరు చెరబట్టుకు పోయినాడనీ, చంటిబిడ్డను దాదులు పాలిచ్చి పెంచుతున్నారనీ జాబులు రాసి డేగలమెడలకు కట్టి, ఊరు బైట వాటిని వదిలేశారు. మూడుజాముల కల్లా డేగలు గండికోటకు వచ్చి వాలాయి.

జాబులలో ఉన్నవార్త వినగానే ఏడుగురు అన్నదమ్ములూ బాకులు దూశారు. వారి వెంట పన్నెండువేల సేన ఉన్నది. రెండు వందల ఫిరంగులు ఉన్నవి. ఈ సైన్యంతో నాగళ్లపూడి గట్టుమీద పడి, రాముడు రావణాసురుణ్ణి సంహరించి సీతామ్మవారిని తెచ్చినట్టు, ఫకీరువాణ్ణి చంపి బాలనాగమ్మను తెచ్చుకోవటానికి సన్నాహం చేశారు. శంఖాలు మోగాయి. దండుబూరలు మోగాయి. గుర్రాలమీద



ఢంకా మోగింది. అట్టహాసంగా సైన్యం కదిలింది. పులిరాజు పట్టణమూ, గంగవాడి పట్టణమూ వాటి నాలుగోరోజుకు సైన్యం నాగళ్ళపూడి గట్టు చేరి కోట నాలుగు వైపులా ముట్టడించారు. ఘడియ పొద్దెక్కేసరికి ఫిరంగులు బారు చేసి మూడు వరసలు కాల్చారు. కాని, ఒక్క గుండుకూడా కోటకి తగలలేదు, కోటలోపల పడలేదు. గుళ్ళన్ని మధ్య దారిలోనే పగిలిపోయాయి. కోట గోడకున్న ఇంత సున్నపు బెత్తికఅయినా ఊడలేదు, ఫకీరువాడి మహిమ!

ఇన్నిఫిరంగులూ మూడు రోజులు పేల్చినా కోట గోడలమీద మనుష్యులు కనిపించక పోయేవరకు కోటలో అసలు మనుష్యు లున్నారా అని రాజులకు సందేహం కలిగి బురుజులకు నిచ్చెన లెత్తించి కొందరు మనుష్యులను గోడల పైకి ఎక్కించారు. కోటలోపల ఎక్కడా ఒక మగపురుగు లేదు. ఫకీరు చెరపట్టి తెచ్చిన ఆడజనం అక్కడక్కడా కనిపించారు. చివరకు మసీదుబయట పట్టె మంచంమీద పడుకుని చల్లగాలికి నిద్ర పోతున్న ఫకీరు కనిపించాడు. వాణ్ణి చూడ



గానే ఫిరంగులను గిలకలమీద బురుజుల పైకి ఎత్తించారు.

ఈలోపుగా గాండ్లసంగు కోటగోడలమీద మనుష్యులను చూసి, "లేవరా, ఫకీరూ, నీ పొగరు అణచటానికి శత్రువు లొచ్చారు. నిన్ను హతమారుస్తారు, లే!" అని నిద్ర లేపింది. కాని ఫకీరు లేవలేదు. గరిటె ఎర్రగా కాల్చి అంటించినా వాడు గుర్రు పెట్టి నిద్రపోతూనే ఉన్నాడు.

రాజులు ఫిరంగులు బారుచేసి మాయల ఫకీరు మీద పేల్చారు. ఏవో నల్లులు కుడుతున్నా యనుకొని ఫకీరులేచి చూశాడు. శత్రువు లొచ్చారని కనుక్కున్నాడు. వెంటనే బాలనాగమ్మను తీసుకొని మశీదు పైకి ఎక్కాడు. బాలనాగమ్మ మశీదుపైనుంచి తన భర్తనూ, బావగార్లనూ, వారి సైన్యాలనూ చూసి పెద్ద పెట్టున ఏడిచింది.

అది చూసి ఫకీరు, "ఎందుకే ఏడుస్తావు? వీళ్లు మనల్ని ఏమైనా చెస్తారనుకున్నావా? మనకేమీ భయంలేదు. నా దెబ్బ చూడు," అంటూ ఒక లాఠీ తీసి దాన్ని మంత్రించి పంపాడు. అది కోట దాటిపోయి శత్రువులతో యుద్ధం చెయ్య సాగింది. దాని దెబ్బకు తట్టుకోలేక సైనికులు



పారిపోసాగారు. లాఠీ మూడువందల మందిని చంపి ఫకీరుచేతికి తిరిగి వచ్చింది.

"ఇప్పుడు మనం స్వయంగా వెళ్లి లడాయిచేస్తాం," అంటూ ఫకీరు, కుళ్లాయి పెట్టి, కంబళి నడుముకు చుట్టి, కర్ర చేతపట్టి, గుప్పెడు విభూతి తీసుకుని, "యారే అల్లా, యారే ఖుదా" అనుకుంటూ తూర్పు దర్వాజాగుండా కోటదాటి శత్రు సైన్యాల మధ్యకు వచ్చాడు. తక్షణం పన్నెండు వందల సైనికులు ఫకీరును చుట్టుముట్టి ఏ కండ కా కండ నరికేశారు. మరుక్షణమే వాడు ఇంకోమూల పుట్టాడు. అక్కడకూడా వాణ్ణి తల కొట్టేశారు.

ఈవిధంగా వాణ్ణి నరుకుతూనే ఉన్నారు, వాడు మళ్లీ పుడుతూనే ఉన్నాడు. ఆఖరుకు సైనికులు విసిగి, వాణ్ణి చంపి దహనంచేసి బూడిదఎత్తి చెరువులో పోశారు. చెరువునీటి లోంచి ఫకీరులేచివచ్చి, "ఒరే, ఇంతవరకు లడాయిమీది. ఇక మా లడాయి చూడండి" అని చేతిలోవిభూతి అన్నివేపులాచల్లాడు.

వెంటనే రాజుల ఏనుగలన్నీ నల్లరాళ్లు ఐపోయాయి. గుర్రాలు నాపరాళ్లయాయి. ఒంటెలు ఎర్రరాళ్ళయాయి. పన్నెండు వేల బలగమూ రాళ్లగుట్ట లయిపోయారు. ఫిరంగులు నీళ్లకుండలయాయి. ఏడుగురు రాజుల డేరాలూ గోరింటపొద లయిపోయాయి. ఏడుగురు రాజులూ పుట్టలైపోయారు. రాజుల వెంటవచ్చిన ముగ్గురు మంత్రులూ శిలలయినారు. ఈ విధంగా సైన్యం యావత్తూ ఒక్కసారిగా మాయమైపోయింది. ఎక్కడా ఏ అలికిడీ లేదు.

మాయల ఫకీరు బాలనాగమ్మ దగ్గరికి తిరిగిపోయి, "చూడవే, భామా, ఇక మన ఇద్దరికీ అడ్డులేదు. రా, ఒక్క ముద్దియ్యి," అంటూ ఆమెను కౌగిలించుకోబోయాడు.

"ఓరీ, ఫకీరూ, నా పన్నెండేళ్ళ వ్రతం పూర్తికాకుండా నన్నంటితే తల పగిలి చస్తావు, జాగ్రత్త," అన్నది బాలనాగమ్మ.



బాలనాగమ్మ కొడుకు బాలవద్దిరాజు క్రమంగా పెరిగి పెద్దవాడు కాసాగాడు. అయిదోయేడు రాగానే అక్షరాభ్యాసం చేయించారు. ఒక్క ఘడియలో ఓనామాలు పూర్తిచేశాడు. మరో ఘడియకల్లా గుణింతాలు వచ్చేశాయి. చూస్తుండగానే బాలవద్దిరాజు బాలరామాయణమూ, అమరమూ, గజేంద్రమోక్షమూ, భారత భాగవత రామాయణాలూ, కావ్యాలూ, అలంకారాలూ చదివి పూర్తిచేసేశాడు.

చదువు పూర్తికాగానే రోజుకు వరహా జీతం ఇచ్చి ముగ్గురు జట్టీలను ఏర్పాటు చేశారు. బాలవద్దిరాజు గరిడీ సాములు నేర్చాడు. దండాలూ, గుంజీలూ తీశాడు. జోడీలు తిప్పాడు. కత్తిసాము నేర్చాడు. విల్లూ బాణమూ నేర్చాడు. బాలుడి ప్రజ్ఞ చూసి ఊళ్ళోవాళ్ళంతా సంతోషించారు. తండ్రులకు కీర్తి తెస్తాడన్నారు.

ఇట్లా ఉండగా ఒకనాడు నంబివారి నరసమ్మ కడవ బుజాన పెట్టుకొని నీళ్లకు పోతూ ఉండగా చూచి బాలవద్దిరాజు తన కేపాటి గురి ఉందో చూచుకోవటానికి బాణం ఎక్కుపెట్టి వదిలాడు. నరసమ్మ చేతిలో కుండ పుటుక్కున పగిలి, ఆమె

ఏకుగురు రాజులూ పన్నెండువేల బలగమూ ఒక్కసారిగా చచ్చిపోయారన్నవార్త రాగానే పానుగంటిపట్టణమంతా ఆర్తనాధాలతో దుఃఖసముద్రంలో మునిగిపోయింది. పట్టణానికే వైధవ్యం కలిగినట్టయింది. బాలనాగమ్మ అక్కలు ఆరుగురూ భర్తలకోసం గొల్లున ఏడిచారు. తలలు పగలగొట్టుకో బోయినారు. కాని వారుకూడా చస్తే ఇక బాలనాగమ్మ కొడుకును యెవరు చూస్తారు? ఆరుగురూ గుండెలు రాళ్లుచేసుకొని, వెంట్రుకతో కొండపాకిన చందంగా, ఆ కుర్రవాణ్ణి చూసుకుంటూ రోజులు గడపసాగారు.

బొటనవేలికి ములికి తగిలి నెత్తురుబొట్లు కారాయి. అది చూసుకుని కోపంవచ్చి నరసమ్మ, "నీ తల్లి బాలనాగమ్మను, మహా ఇల్లాలిని ఆ ఫకీరువాడట్లా చెర పట్టుకు పోయాడు గాని నీకు మాత్రం చావు రాకపోయె." అని తిట్టింది.

ఈ మాటలువిని బాలవద్దిరాజు నిర్ఘాంత పోయాడు. ఆమాట మళ్లీ చెప్పమని బతిమాలాడు, బెదిరించాడు. నరసమ్మ కథ అంతా చెప్పింది. తన తల్లి బాలనాగమ్మను మాయలఫకీరు చెరపట్టి నాగళ్లపూడిగట్టుకు తీసుకుపోవటమూ, వాడిమీదికి దండెత్తి పోయిన తన తండ్రులు ఏడుగురూ రాళ్లయి పోవటమూ బాలవద్దిరాజుతెలుసుకున్నాడు.

"ఇదంతా నాకు తెలియదు. నన్ను తిట్టమాకు, నరసమ్మా. దీవించు. నేను నీ కొడుకును, నీవు నా తల్లివి," అన్నాడు.

"వర్ధిల్లు, నాయనా, బాలవద్దిరాజా! నువు వెళ్లి నీ తల్లిని రక్షించుకురా. ఆ మాయల ఫకీరు నీ చేతిలో చస్తాడులే," అని నరసమ్మ దీవించింది.

బాలుడు గరిడీకి తిరిగివచ్చి దానికి తాళం పెట్టేశాడు. నేరుగా ఇంటికివెళ్లి ఆలోచిస్తూ పడుకున్నాడు. స్నానానికి



లేవమంటే లేవడు. అన్నం తినడు. పిలిస్తే పలకడు.

"ఎవరైనా తిట్టారా, కొట్టారా? ఎందుకు రాపలకవు?" అని తల్లులు బతిమాలారు. చివరకు బాలవద్దిరాజు, "మా అమ్మ ఎవరు? నాన్న ఎవరు?" అని అడిగాడు.

"మేమే నీకు అమ్మలం. నీ తండ్రులు చచ్చిపోయారు." అన్నారు వాళ్లు.

"మీ ఆరుగురికడుపునా నేను పుట్టానా? మీలో నన్ను కన్నదెవరు? చెబుతారా, చెప్పరా?" అన్నాడు బాలుడు.

"అయ్యో, తండ్రీ, నీ కిదంతా ఏ గొడ్డు మోతుముండ చెప్పిందిరా? పిల్లల్ని కన్న

తల్లి ఎవతె అయినా చెబుతుందా?" అని వాళ్లు శాపనార్థాలు పెట్టసాగారు.

"ఒకరిని ఎందుకు తిడతారమ్మా? మీకు వచ్చిన భయమేమీ లేదు, నా తలిదండ్రు లెవరో, వాళ్ళ కథ ఏమిటో చెప్పండి," అన్నాడు బాలుడు.

ఇక దాచి లాభం లేదనుకుని వాళ్ళు జరిగినదంతా చెప్పి, "ఈ వంశానికి నువ్వొక్కడవు దక్కావు, నాయనా, నిన్ను మేము పువ్వుల్లో పెట్టి పెంచాము," అన్నారు.

"నేను వెళ్లి మా తల్లిని చూసివస్తాను. అనుజ్ఞ ఇవ్వండి," అన్నాడు బాలుడు.

"అయ్యో, నాయనా! నువ్వు అక్కడి కెట్లా పోతావు? పన్నెండువేల బలగాన్ని పొట్టన పెట్టుకున్నాడే, ఆ మాయల ఫకీరు నిన్ను బతకనిస్తాడా? నువు నిజంగానే పోదలచుకుంటే మా అరుగురికీ నీ చేతి మీదిగానే ఇంత విషంపెట్టి, మమ్మల్ని ఇంత బూడిదచేసి ఆతరవాత వెళ్ళు. మేము నీకోసం బతికుండి ఏడవలేము," అన్నారు తల్లులు.

"మీ రేమీ భయపడకండి. నేను నాగ మల్లె విత్తులు తెచ్చి అంతఃపురంలో నాటు తాను. నేను ఎన్నిసార్లు అన్నం తింటానో అన్నిసార్లు వాటికి మీరు నీరుపొయ్యండి. నాగమల్లెలు బతికున్నంతకాలమూ నేను క్షేమంగా ఉన్నా ననుకోండి. అవి ఎండి పోయినప్పుడు నేనిక లేననుకోండి." అని బాలుడు వాళ్ళకి నమ్మకం చెప్పాడు.

బాలుడికి భోజనం పెట్టారు. అన్నం మూటగట్టి ఇచ్చారు. తండ్రిగారి నగలు పెట్టారు. బాలుడు చారెడేసి పోగులు పెట్టాడు. మురుగులు, గొలుసులు, చంద్ర హారాలు, రవలహారాలు, జాలరు వరహాలు ధరించాడు. తాతగారి చంద్రాయుధం మొలలో పెట్టాడు. రత్నకంబళి పైన వేసుకొని అరుగురు తల్లులకు దణ్ణంపెట్టి ప్రయాణమైనాడు. [ఇంకావుంది]






ఒకానొక ఊరిలో ఒక పేద దంపతులకు ఒక కొడుకు, కూతురు ఉండేవారు. తండ్రి కూలీనాలీ చేసుకొనేవాడు. ఇల్లాలు ధాన్యం దంపులకు పోయి చారెడు గింజలు చేత పట్టుకవచ్చేది. కుర్రవాడు అడవులలో ఉడుములను వేటాడి తెచ్చి వూళ్లో అమ్ముకునేవాడు. ఆడపిల్ల ఇంట్లోనేవుండి, ముగ్గురు తెచ్చినవీ పొదుపు చేసిపెట్టేది.

కుటుంబం అందరిలోనూ ఆడపిల్ల తెలివయినదీ, చురుకయినదీ, ఉపాయమెరిగినదిన్నీ. ఒకనాడు ఆమె తండ్రివద్దకు వెళ్లి "నాన్నగారూ! ఇలా మనం ఎన్నాళ్లు కష్టపడినప్పటికీ కడుపు నిండటం లేదాయె. శెట్టిదగ్గిర ఒక వంద రూపాయలు అప్పు తెచ్చి, వ్యాపారం చేయండి. దేవుడి దయవల్ల మనకు కలిసివస్తే, నిమిషంలో అప్పు తీర్చి పారేయవచ్చు" అని సలహా చెప్పింది.

అందుకు అతను "తల్లీ! నువు చెప్పిన మాట బాగానే వుంది. కాని, ఋణం చేసినట్టయితే దానిని తీర్చే మార్గం ఏది? శెట్టి సామాన్యుడు కాడు. మంచిమాటలు చెబుతూనే వుంటాడు. గడువు దాటిందంటే అనరాని మాటలు అని, రచ్చకు లాగుతాడు. ఆ కర్కోటకుడితో మనం బాధలు పడలేము. అయినా, అప్పు చేసుకొని పప్పూకూడూ తినడం ఏమంత మంచిది?" అన్నాడు.

ఈమాటలకు ఆ అమ్మాయి "నాయనా, మీరేమీ భయపడవద్దు. నెల వాయిదాకు ఒక వంద రూపాయలు శెట్టివద్ద తీసుకువచ్చి, ఆ సొమ్ముతో పట్నం పోయి సరకు పట్టుకురండి. ఈలోపల ఏమి జరిగినా, నేను చూసుకొంటా"నని ధైర్యం చెప్పింది.

సరే, ఇంత ధైర్యంగా పిల్ల ఎందుకు చెబుతున్నదో, అదీ చూదాం అనుకొని,

కె. వైదేహి - హిందూపురం.




ఈ జవాబు వినేవరకు, శెట్టికి మంట ఎత్తుకువచ్చింది. "సరి, మీ అమ్మ ఏది?" అని కోపంగా అడిగాడు.

"మా అమ్మ గడ్డ ఇంటికి వడ్లు దంచటానికి పోయింది" అని ఆపిల్ల నిలకడగా చెప్పింది.

ఈ మాటలు శెట్టికి అసలే అర్థం కాక, ఆమె తనను వేళాకోళం చేస్తున్న దనుకొన్నాడు.

"సరే, మీ అన్న ఏమయినాడు?" అని శెట్టి కోపంగా అరిచాడు.

అందుకు పిల్ల నవ్వుతూ "మా అన్న కాళ్లు లేని గుర్రం ఎక్కి, వెంట్రుకలు లేని ప్రాణిని వేటాడటానికి వెళ్ళాడండి" అన్నది.

శెట్టికి ఈమారు కోపం ఆగలేదు. ఈ పేదవాళ్లకు ఇంత పొగరా? అని అనుకొంటూ వెంటనే వెళ్లి రాజుగారితో ఫిర్యాదు చేశాడు.

రాజుగారు ఆ పిల్లను పిలిపించి విచారణ చేశారు. అందుకు ఆ అమ్మాయి "మహాప్రభూ! నేను చెప్పిన మాటలలో ఒక్కటీ తప్పు లేదండి. శెట్టిగారికి నా మాటలు అర్థమయినయ్యో లేదో" అన్నది.

అతను శెట్టిదగ్గర నూరు రూపాయలు బదులు తెచ్చి, సరకు బేరం చేయటానికని పట్నం వెళ్లాడు. కాని, అనుకొన్న గడువు లోపల అతను తిరిగి రాలేకపోయాడు.

సరిగా ముప్పయి రోజులూ పూర్తి అయే సరికి, ప్రొద్దున్నే శెట్టి వాళ్ళఇంటికి చక్కా వచ్చాడు. శెట్టి వచ్చే సమయానికి పిల్ల ఒక్కర్తే ఇంట్లో వున్నది.

"మీనాయన ఏడి?" అని శెట్టి అడిగాడు.

"ఊరుకి వెళ్లాడు" అని పిల్ల చెప్పింది.

"ఎప్పుడు వస్తాడు?" అని శెట్టిఅడిగాడు.

"వస్తే రాడు, రాకుంటే వస్తాడు" అని పిల్ల నిదానంగా జవాబిచ్చింది.



"మరైతే, నీవు చెప్పిన జవాబులకి అర్థ మేమిటో విప్పి చెప్పు" అన్నారు రాజుగారు. అప్పుడు ఆ పిల్ల—

"మహారాజా! మా నాయన వెళ్లే వూరికీ, మనవూరికీ మధ్యని ఏరున్నది. అది కొండవాగు కనుక చినుకు పడటంతోనే నిండి పారుతుంది. ఒకవేళ మానాయన బయలుదేరే సమయానికి వాన వస్తే ఏరు అడ్డుకొంటుంది. కనుక ఏరు 'వస్తే రాడు, రాకుంటే వస్తాడు' అని శెట్టిగారి మొదటి ప్రశ్నకు జవాబిచ్చాను" అని చెప్పింది.

తరువాత 'గడ్లయిల్లేమిటి? వడ్లు దంచడ మేమిటి?' అని రాజుగారు అడిగారు. దానికి 'గడ్లవారనే ఇంటిపేరుతో ధనవంతు లున్నారండి. అక్కడికి మా అమ్మ వడ్లు దంచటానికి వెళ్లింది." అని చెప్పాను. ఈ మాట అర్థం చేసికోలేక పోయారు శెట్టిగారు' అన్నది.

అపిమ్మట రాజుగారు, "కాళ్లులేనిగుర్రం వుంటుందా, ఏమిటామాట?" అనిఅడిగారు. అందుకు అపిల్ల "'మీ అన్న ఏడీ?' అని శెట్టిగారు అడిగారు. మా అన్న చిన్నప్పటినించీ, చెప్పులు తొడుగుకొని అడవిలోకి ఉడుముల వేటకు పోతాడు. కాళ్లులేని గుర్రము అంటే చెప్పులు. ఉడుముకి వెంట్రుకలుండవుకదండి! కనుక వెంట్రుకలులేని ప్రాణిని వేటాడటానికి వెళ్లాడన్నాను," అని చెప్పింది.

పిల్లతెలివితేటలకూ యుక్తికీ రాజుగారు మెచ్చుకొని, శెట్టికి నూరురూపాయలు జరిమానా విధించి, ఆ సొమ్ము పిల్లకు బహుమానం చేశారు. రాజుగారి ఎదటనే ఆ నూరురూపాయలూ ఆమె శెట్టికి జమ కట్టి, బాకీ లేదనిపించుకొన్నది.

మరునాడే, పట్నం పోయిన తండ్రి సరకులతో ఇంటికి వచ్చి, తన కూతురు చేసిన యుక్తి తెలుసుకొని సంతోషించాడు.




అనగా అనగా ఒక వూరిలో వీరన్న అనే దొంగ ఉండేవాడు. ఒకరోజున వాడొక ఇంటికి కన్నము వేసి, లోపలికి ప్రవేశించ బోయేసరికి, వాని పక్క నుంచే ఒక త్రాచు పాము జరజరా ప్రాకి లోపలికి వెళ్లింది. వీరన్న ఉలిక్కిపడి ఆ పాము వంక చూస్తూ, అలాగే నిలబడిపోయాడు.

ఆ త్రాచుపాము తిన్నగా గదిలోకి పోయి, అక్కడ వున్న నీళ్లబిందెలో విషం కక్కి, వచ్చిన దారిని వెళ్లిపోతున్నది. ఇంతలో వీరన్న తనవద్ద నుండే చిన్న కర్ర తీసుకొని పామును కొట్టబోయేసరికి, అది ఒక చక్కటి స్త్రీరూపంతో ప్రత్యక్షమైంది. ఆమె వీరన్నతో 'నువ్వు మాటాడక నా వెంట రావోయి' అని అనేసరికి, ఆశ్చర్యంతో అతను ఆ సుందరి వెంబడి పోసాగాడు.

ఆమె వూరి బయటకు వచ్చి, అక్కడ నూతిపైన వుండే కర్రను విరగగొట్టి, మళ్లీ యథాప్రకారం మామూలు చోట ఉంచి వేసింది. వీరన్న ఉండబట్టలేక, ఆమె చేయి గట్టిగా పట్టుకొని, "ఎందుకమ్మా ఆ కర్రను అనవసరంగా విరగగొట్టేశావు? మళ్లీ ఎందుకు ఏమి ఎరగనట్టు ఆ కర్రను ఎప్పటిలాగా పెట్టివేశావు? ఇంతకూ నీ వెవరవు?" అని అడిగాడు.

అందుకు ఆమె "నా పేరు 'అకాల మృత్యువు.' బ్రహ్మ పోసిన ఆయువు పూర్తి కాకమునుపే కొందరి ప్రాణం తీసివేస్తూ వుంటాను. ఇదే నా పని" అని చెప్పింది.

"బ్రతికివున్నవాళ్ళ ప్రాణాలు తీయటం బాగానే వున్నది. మరయితే ప్రాణంలేని ఆ కర్రను ఎందుకు విరగగొట్టావు?" అని వీరన్న అడిగేసరికి, "ఆ సంగతి ఇప్పుడు చెప్పను. రేపు ఉదయంవరకు ఇక్కడనే వుండి, ఏమి జరుగుతుందో చూడు. నీకే తెలుస్తుంది." అని ఆమె అన్నది.

వునికిలి రామకోటీశ్వర రాజు, భీమడోలు

"అయితే నా మరణంకూడా నీ చేతి లోని పనేనా? లేక, నేను ఆయువు పూర్తి అయేవరకూ జీవిస్తానా? చెప్పు" అని వీరన్న ఆత్రంతో అడిగాడు.

దానికి ఆమె "అదీ నా చేతిలో పనే. అయినా, నువు అడిగావు గనక ముందుగా చెబుతున్నాను: కొంతకాలానికి రాజుగారి సొత్తు అపహరించిననేరం నీమీద పడు తుంది. అప్పుడు నా శక్తివలన నీ ప్రాణాలు తీస్తాను. ఇది నా విధి. తప్పటానికి వీలు లేదు. అయితే, ఈసంగతి వెల్లడించినా వంటే, తక్షణమే నీ తల నూరు వ్రక్క లవుతుంది సుమా జాగర్త" అని చెప్పి అదృశ్యమయిపోయింది.

ఈ మాట వినగానే వీరన్నకు విచారం కలిగింది. 'దొంగతనంవల్లకదా ప్రాణాలు పోవటం! కనుక, ఈక్షణంనించీ ఈ వృత్తి మానివేస్తున్నాను' అని దేవునిసాక్షిగా ప్రమాణం చేశాడు.

ఆ తర్వాత అకాల మృత్యువు చెప్పిన ప్రకారం నూతివద్ద ఏమి జరుగుతుందో చూడాలెనని కనిపెట్టుకు కూర్చున్నాడు. తెల్లవారగానే ఆవూరి స్త్రీలు బిందెలు పట్టు కొని నీళ్ళకోసం వస్తున్నారు. వారితో వీరన్న




అమ్మా! 'కర్ర విరిగిపోయింది. నీళ్లు తోడుకొనేటప్పుడు జాగర్త సుమండీ!' అని చెబుదామనుకొన్నాడు.

కాని, ఇంతలో అతని వెనుకనుంచి "బాబోయ్, రక్షించు బాబోయ్" అని వేడు కొంటున్న ఒక స్త్రీ కంఠం వినిపించింది. ఎవరో స్త్రీ పాపం, కష్టదశలో ఉన్నదను కొని, ఆమెను రక్షించడంకోసం ఆ ధ్వని వచ్చినవేపు కంగారుగా పరుగెత్తాడు వీరన్న. కాని, ఎంత దూరం పోయినా, ఎవ్వరూ కనపడలేదు. తిరిగి ఆ కేకకూడా వినిపించ లేదు. ఇంతలో, మృత్యుదేవత చెప్పిన సంగతి జ్ఞాపకంవచ్చి, అతను మళ్లీ నూతి




వద్దకు తిరిగివచ్చేసరికల్లా, ఆ నూతిలో ఒకామె పడిపోవడం, ఆమెను తీయబోయే లోపలనే, శవం నీటిపయిన తేలడం, జరిగింది. ఇదంతా చూచి, వీరన్న విచారం మరింత ఎక్కువయింది.

* * *

వీరన్న ప్రమాణంచేసి, దొంగతనం మాను కొన్న తరవాత ఒక రయితువద్ద కొలువుకు కుదురుకొని, మర్యాదగా జీవనం చేస్తున్నాడు. తలలో నాలుకవలె మెలగటంచేత, రయితుకు ఆతనిమీద మంచి నమ్మకమూ అభిమానమూ కలిగి, వీరన్నను ఒక ఇంటి వానిని చేశాడు.

ఇప్పుడు వీరన్న హాయిగా కాలక్షేపం చేస్తున్నాడు. అతని భార్య గర్భవతి కూడాను. పురిటికి ఆమెను పుట్టింట దిగబెడదామనే వుద్దేశంతో, యజమానివద్ద సెలవు తీసుకొని వీరన్న బయలుదేరాడు.

అయితే, ప్రయాణమై వెళుతూవుండగా, మధ్య దారిలోనే ఒక వూరిలో అతని భార్య ప్రసవించి, పిల్లవాడిని కన్నది.

'సరే, దేవుని దయవల్ల ఇంత వరకు బాగా నేవున్నది. మీరు వెంటనే దగ్గిరగావుండే పట్నం పోయి, 'కాయపు' దినుసులూ, ఇంగువ పట్టుకరండి' అని ఆమె చెప్పగానే, అవి తీసుకువద్దామని వీరన్న పట్నానికి బయలుదేరాడు.

* * *

ఇది ఇలా వుండగా—ఆ వూరి రాజుగారి కోటలో రెండు పందెపు కోళ్లు కనపడలేదు. ఆ కోడిపుంజులు రాజుగారికి ఎంతో ప్రియమైనవి. అందుచేత, ఎలాగైనా సరే వాటిని వెతికిపట్టమని భటులను వాడవాడలా పంపించారు. రెండురోజులలో తీసుకురాలేక పోతే, వాళ్ల తలలు తీయించివేస్తామన్నారు.

ఎంత వెతికినా కోడిపుంజులు దొరకలేదు. అప్పుడు రాజభటులంతా చేరి

ఒక ఆలోచన చేశారు. మసాలాదినుసులు కావాలని ఎవళ్లు వచ్చినా సరే, వెంటనే పట్టి ఇవ్వవలిసిందని దుకాణదారులందరకూ తెలియజేశారు. కోడిపుంజులను దొంగలించినవాళ్లు వాటిని వండుకు తింటారుకదా, వాటి వంటకు తప్పక మసాలా దినుసులు కావాలిగదా అని రాజభటుల వుద్దేశం.

మన వీరన్న ఆ పట్నంలోవున్న ఒక దుకాణానికి వచ్చి, "ఇంగువ, కాయపు దినుసులు" అని భార్య చెప్పిన మాటలు మరచిపోయి 'మసాలాదినుసులున్నాయా?' అని సాహుకారిని అడిగాడు.

"ఉన్నాయి కాని, అవి ఎందుకో చెబితే కాని ఇవ్వను" అని సాహుకారన్నాడు.

"ఎందుకేమిటయ్యా, వింతగా అడుగుతున్నావు. ఊరిబయట నా భార్య ప్రసవించింది. ఆమె ఏవో దినుసులు తెమ్మని చెప్పింది. పేరు గుర్తు రావటం లేదు. ఇవయినా పట్టుకవెళ్లితే కొంత పని జరుగుతుందేమోనని ఇమ్మన్నాను" అనేసరికల్లా, సాహుకారు వీరన్నను పట్టి రాజభటులకు వప్పగించాడు. రాజభటులు అతనిని పట్టుకొని "నీ భార్య ఎక్కడ ప్రసవించిందో



చూపించు. నిజమైతే నిన్ను వెంటనే విడిచిపెడతాం, అబద్ధమయితే ఖైదుచేస్తాం" అని వీరన్నను వెంటబెట్టుకు వెళ్ళారు.

తీరా, ఆమెను విడిచివచ్చిన చోటికి పోయేసరికి, అక్కడ వీరన్న భార్యా లేదు, పిల్లవాడూలేడు. పైగా, ఒక పొయిమీద కుండలో మాంసం కుతకుత ఉడుకుతున్నది. ఆ పక్కనే కోడిబొచ్చు వగైరాలు కనిపించినాయి. ఇంక సందేహమేమిటి?

భటులు వెంటనే వీరన్న చేతులకు బేడీలు తగిలించి, రాజు ఎదటకు తీసుకువచ్చి నిలబెట్టారు "మహాప్రభో! వీడు

కోడిపుంజులను పందుకోవటం మేము కళ్లారా చూచి తీసుకువచ్చామండి!" అని చెప్పేసరికి, "అయితే, ఈ దుర్మార్గుణ్ని ఏనుగులచేత తొక్కించి చంపండి" అని రాజు అజ్ఞాపించాడు.

* * *

ఇంతలో మరి ఒక వేపు వెళ్లిన భటులు కోడిపుంజులు దొరికినవని చెప్పి ఉత్సాహంతోతెచ్చి రాజుకి చూపించారు. రాజుకి సంతోషమూ ఆశ్చర్యమూకూడ కలిగినై. వీరన్నను చంపక, మళ్లీ దర్బారుకు రప్పించమని రాజుగారు ఆజ్ఞాపించారు. ఇంకా తొక్కించివేదామని అప్పటికప్పుడే ఏనుగుకింద పడుకోబెట్టిన వీరన్నను లేవదీసి, తిరుగా దర్బారుకు తీసుకుపోయారు.

రాజుగారు అప్పుడు దర్బారుచేసి, పండితులను పిలిపించి, 'అనవసరంగా మరణదండన విధించినందుకు పరిహారము ఏమిటి?' అని ప్రశ్నించారు. దానికి పండితులు వీరన్నకు ఒక బంగారపు యేనుగును, అతను మోయగలిగినంత దానిని బహుమాన మీయవలసిందని సలహా చెప్పారు.

ఆప్రకారం బంగారు ఏనుగను తయారు చేయించి వీరన్న తలపైన పెట్టేసరికి, దాని బరువు భరించ లేక, "అబ్బా! అకాల మృత్యువా? ఇదంతా నీ పనేకదా, ఎన్నెన్ని చిత్రాలు చేశావు దేవీ?" అని అనుకొంటూ ముక్కుల వెంట నెత్తురు గక్కుకొని వీరన్న ప్రాణాలు విడిచాడు.

తరవాత, వీరన్న చెప్పిన చివరిమాటలలో నిజానిజాలు తెలుసుకొని, రాజుగారు ఆశ్చర్యపడ్డారు. అయితే, ఇప్పుడు ఎవరైనా చేయగలదేమున్నది? అతని జ్ఞాపకార్థం ప్రత్యేకం ఒక ఊరు కట్టించి, రాజుగారు దానికి 'వీరవాసరం' అని పేరు పెట్టారు.






పూర్వకాలమందు ఒకసిపాయి యుద్ధం నుంచి తిరిగి తన దేశం పోబోతున్నాడు. దారిలో వానికి ఒక భూతం ముసిలిదాని రూపంతో ఎదురుపడి, 'ఏమయ్యా సిపాయీ! నిన్నూ నీ వేషమూ చూడగా గొప్ప ధైర్యవంతుడిలా కనపడుతున్నావు. మరి, నీకు కోరినంత ధనం దొరికే ఉపాయం చెబుతాను, నే చెప్పినట్టు చేస్తావా?' అన్నది.

'అయ్యో అంతకంటేనా! ఆ వుపాయం ఏమిటో చెప్పు' అన్నాడు సిపాయి.

'అదుగో, ఆ చెట్టు చూశావా? దాని లోపలంతా డొల్లగానే వుంటుంది. నీవు చెట్టు ఎక్కి ఆ డొల్లలోకిదిగు. నీ నడుముకి ఒక మోకు కడతాను. నీవు లోపలనుంచి ఎప్పుడు పిలిస్తే అప్పుడు మోకు పట్టి లాగుతాను. నువు బయటకు వచ్చేసెయ్యొచ్చు,' అని ముసిలిది చెప్పింది.

'సరే' అన్నాడు సిపాయి.

అప్పుడు చెట్టులోపలికి దిగినతరవాత ఏమి చేయాలో ముసిలిది చెప్పసాగింది:

'కిందికి దిగగానే ఒక పెద్ద చావడీ, వరసగా మూడు గదులూ కనబడతాయి. చావడిలో ఎల్లప్పుడూ వేయి దీపాలు వెలుగుతూ వుంటాయి. మొదటిగది తెరవగానే మధ్యని ఒక పెద్ద భోషాణమూ, దానిపైన ఒక భయంకరమైన కుక్కా కనబడతాయి. ఇదుగో నా నీలితివాసి నీకు ఇస్తున్నాను. ఇది నేలమీద పరిచి కుక్కను ఎత్తి దానిమీద పడుకోబెట్టితివంటె అది నిన్నేమీ చేయదు. అప్పుడు భోషాణంలో వుండే రాగినాణాలు నీ ఇష్టం వచ్చినన్ని తీసుకోవచ్చు.

'ఒకవేళ నీకు రాగినాణాలు అక్కరలేకపోతే, రెండోగది తెరువు. అక్కడ భోషాణం నిండా వెండినాణాలు, దానిపైన

డి. నరసింహమూర్తి, విజయవాడ



ఇంకా భయంకరమైన కుక్క కనపడ తాయి. కుక్కను తివాసిపైన పడుకోబెట్టి, నువు మోయగలిగినన్ని నాణాలు తెచ్చుకో.

'రాగీ వద్దు, వెండీ వద్దు, బంగారం మీద మోజున్నదంటావా? మూడవ గది తెరువు. ఈ గదిలో భోషాణంమీద మరింత భయంకరమయిన కుక్క వుంటుంది. దాన్ని తివాసీమీద పడుకోబెట్టి, కావలసినంత బంగారం తెచ్చుకో,' అని ముసిలిది రహస్యాలు వెల్లడించింది.

అప్పుడు సిపాయి, 'పెద్దమ్మా! నువు చెప్పిందంతా బాగానే వుంది. అయితే ఏ ఉపకారమూలేకుండా ఇటువంటిరహస్యం ఎవళ్లూ చెప్పరుకదా. తెచ్చిన ధనంలో నీకేపాటి వంతు కావాలో ఇప్పుడే తేల్చు; తరవాత పేచీపెడితే కుదరదు' అన్నాడు.

"నువు కష్టపడి తెచ్చుకొనే ధనంలో నాకు ఒక్కదమ్మిడీ ఐనా వద్దు. నీవు వచ్చేటప్పుడు ఆ వసారాలో అగపడే 'చెకుముకి రాయి' మాత్రం తెచ్చి నాకియ్యి. మా అమ్మమ్మ బతికివుండగా ఒకమాటు అక్కడకు వెళ్లి దాన్ని మరిచిపోయి వచ్చింది. అది తెచ్చి పెట్టావంటే ఆవిడ జ్ఞాపకార్థం దానిని మేము జాగర్త పెట్టుకుంటాము. అని ముసిలిది చెప్పింది. సిపాయి 'సరే' నన్నాడు.

* * *

సిపాయి నడుముకి ముసిలిది మోకు బిగించింది. తన నీలితివాసీ చేతికిచ్చింది.

అతను చెట్టులోపలినుంచి కిందికి దిగి, వసారా మొదటి గది తెరిచాడు. భోషాణం మీద కూర్చున్న కుక్క బంతులంతేసి కళ్లతో సిపాయివేపు భయంకరంగా చూచింది. అతను జంకు లేకుండా కుక్కను ఎత్తుకుని నీలి తివాసిమీద ఉంచి 'వోయి నేస్తం! హాయిగా తివాసిపైనకూర్చో' అన్నాడు. కిక్కురుమనకండా ఆ కుక్క

పడుకుంది. అప్పుడు సిపాయి భోషాణం తెరిచి జేబులు పట్టినన్ని రాగినాణాలు నింపుకొని, తిరిగి భోషాణం మూసివేసి, కుక్కను మళ్లీ దానిపైన కూర్చోబెట్టాడు.

తరవాత అతను రెండో గది తెరిచేసరికి బండిచక్రాలంతేసి కళ్ళతో భోషాణంమీది కుక్క భయంకరంగా చూసింది. మునపటిలాగానే ఈ కుక్కనూ నీలి తివాసిపైన పడుకోబెట్టి భోషాణం మూత తీసేసరికి అతని కళ్లు జిగాలుమన్నాయి. జేబులలో వున్న రాగి నాణాలన్నీ అక్కడనే విసిరేసి, ఈమారు జేబులలోనూ, సంచిలోకూడా వెండి నాణాలు నింపుకొన్నాడు. మళ్లీ భోషాణం మూతవేసి, కుక్కను దానిపైన కూర్చోబెట్టి మూడవ గదివద్దకు వచ్చాడు.

ఇక్కడవుండే కాపలాకుక్క సామాన్యమైందికాదు. బ్రహ్మరాక్షసంత భయంకరమయింది. దీనికళ్లు గుడిగోపురాలంతేసి పెద్దవి. దీనిని చూడగానే సిపాయికి కాస్తంత జంకు కలిగింది కాని, గుండె నిబ్బరం చేసుకొన్నాడు.

దీన్నికూడా నీలి తివాసిపైన పడుకోబెట్టి భోషాణం తెరిచేసరికి, దానినిండా బంగారు నాణాలు వున్నై. సిపాయి కళ్లు మిరుమిట్లు



కొలిపాయి. ఆమట్టున, జేబులలోనూ సంచీలోను వున్న వెండినాణాలు విసిరేసి, ఈసారి జేబుల్లోనూ, సంచీలోనే కాకుండా టోపీలనిండా జోళ్లనిండా ఎక్కడఖాళీవుంటే అక్కడ పట్టినన్ని బంగారు నాణాలు నింపుకున్నాడు. తరవాత భోషాణం మూసివేసి, కుక్కను దానిపైకబెట్టి, చెట్టుమొదలుకు వచ్చి 'పెద్దమ్మా! మోకు లాగు' అన్నాడు.

'చెకుముకిరాయి తెచ్చావా?' అని ముసిలిది అడిగింది.

'అయ్యో మరిచానే' అని, వెనక్కు వెళ్లి చెకుముకిరాయి చేత పట్టుకువచ్చి, మళ్లీ ఈసారి 'మోకు లాగ'మన్నాడు.



ముసిలిది మోకు లాగింది. సిపాయి బయటకు వచ్చి "ఇదుగో చెకుముకిరాయి. దీనితో ఏమిచేస్తావో చెప్పు" అని అడిగాడు.

"ఆగొడవంతా నీ కెందుకు? నీకు ధనం దొరికే ఉపాయం చెప్పాను. ఆప్రకారం వెళ్ళి నువు ధనం తెచ్చుకున్నావు. ఈ ఉపకారానికి బదులు నేనుకోరిన చెకుముకి రాయి నా కివ్వడమే న్యాయం. కనుక, నా చెకుముకిరాయి ఇచ్చేసి, నీ దారిని నువు వెళ్లు" అని ముసిలిది అన్నది.

రాయి సంగతి చెబితేకాని వల్లకాదని సిపాయీ, 'ఇదివరకే చెప్పాను కదా' అని ముసిలిదీ జగడమాడుకొన్నారు. చివరకు ముసిలిది మొండిపట్టు పట్టేసరికి, సిపాయి చ(రున కత్తి దూసి, ఆమె పీక తెగవేశాడు.

ముసిలిదాని పీడ అంతటితో వదిలి పోగానే సిపాయి తన ధనమంతా నీలి తివాసిలో కట్టి బుజాన వేసుకుని, చెకుముకి రాయి జేబులో వేసుకొని, నాలుగామడ దూరంలో వున్న బస్తీ చేరుకున్నాడు.

* * *

సిపాయికి ఇప్పుడు ధనం బాగా చేతులో ఆడుతూ ఉండటంవల్ల సదుపాయంగా భోజనం అమరింది. కోరిన దుస్తులు వేసుకొంటున్నాడు. ఒక సత్రంలో పెద్ద గది తీసుకుని, దర్జాగా కాలక్షేపం చేస్తున్నాడు.

అతని వేషమూ, అతని భాగ్యమూ చూచి అనేకమంది సిపాయిని ఆశ్రయించి ఊళ్ళో జరిగే ఊసులు పిచ్చాపాటీగా చెప్పేవారు. మాటల సందర్భంలో రాజును గురించీ, త్రిలోకసుందరి అయిన రాజకుమారినిగురించీ అతనికి చెప్పారు.

"అయితే ఆమెను నేను చూడాలి. ఎలా చూడగలనో, ఎప్పుడు చూడగలనో చెప్పండి" అని సిపాయి వాళ్లను అడిగాడు.

అందుకు వాళ్లు "వోయి సిపాయీ! రాజకుమారిని చూడటమనేది తేలికయిన పని

కాదు. దోమ దూరని కంచు కోటలో ఆమె వున్నది. ఆ కోటలోకి ఎవ్వరూ వెళ్ళటానికి శక్యం కాకుండా చుట్టూ కందకాలూ, బురుజులూ కట్టించారు. జ్యోతిష్కులు శాస్త్రాలు తిరగవేసి, ఒక సామాన్యమయిన సిపాయి ఆమెకు భర్త అవుతాడని చెప్పారు. రాజుకి అది ఇష్టంలేక, అటువంటి పని జరగకుండా అమెను కంచుకోటలో బంధించి వుంచారు," అని వాళ్లు చెప్పారు.

ఐనా, సిపాయి పట్టుదలతో రాజుగారి పేర జాబు వ్రాశాడు. కాని, రాజుగారు 'టట్, వీలులేదు' అని జవాబు పంపారు.

ఇంతలో సిపాయి తెచ్చిన ధనమంతా ఖర్చయిపోయింది. చేతిలో పైసాలేక, రాత్రిపూట దీపం లేకుండా కాలక్షేపం చేయవలసి వచ్చింది. ఒకనాటి రాత్రి, అతనికి చుట్ట కాల్చుకుందామని బుద్ధి పుట్టింది. అతనికి చెకుముకిరాయి సంగతి జ్ఞాపకంవచ్చి, జేబులోనుంచి తీసి నిప్పు కొట్టాడు. అలా కొట్టగానే అతను ఆశ్చర్యపడేటట్టుగా బంతులంతేసి కళ్లు గల కుక్క ప్రత్యక్షమయి, "స్వామీ!— మీ కేమీ కావాలో చెప్పండి, తీసుకువచ్చి ఇస్తాను" అన్నది.



"భేష్, బాగా ఉన్న"దనుకుని సంతోషించి, "నాకు ధనం కావాలి" అన్నాడు. వెంటనే కుక్క ధనం పట్టుకు వచ్చింది.

అప్పుడు సిపాయి చెకుముకిరాయి తమాషా తెలుసుకొన్నాడు. రాతిని నేలమీద ఒకసారి గీస్తే రాగినాణాల గదిలో వుండే కుక్క వచ్చింది; రెండుసారులు గీస్తే వెండి నాణాల గదిలో కుక్క వచ్చింది; మూడుసారులు గీసేసరికి బంగారు నాణాల గదిలో వుండే కుక్క వచ్చింది.

ఈవిధంగా సిపాయి మూడుకుక్కలచేత డబ్బు తెప్పించి మళ్లీ అతి వైభవంగా కాలక్షేపం చేయసాగాడు.



సిపాయి ఏది కోరినా, కుక్కలు మూడూ అ కోరికలన్నిటినీ నెరవేరుస్తున్నాయి.

మళ్ళీ ఇప్పుడు అతని దృష్టి రాజకుమారి మీదికి మరలింది.

బంతులంతేసి కళ్ళుగల కుక్కను రప్పించి, తన వుద్దేశం చెప్పాడు. ఒక్క క్షణంలో ఆ కుక్క, నిద్రపోతున్న రాజకుమారిని తీసుకువచ్చింది. రాజకుమారి సౌందర్యం కళ్ళారా చూచి సిపాయి మళ్ళీ రాజకుమారిని రాజుగారి మేడలో దిగబెట్టి రమ్మని కుక్కతో చెప్పాడు. అలాగే కుక్క ఆమెని తిరిగి కంచుకోటలో దిగబెట్టి వేసింది.

మరునాడు వుదయం భోజనం చేసేటప్పుడు రాజకుమారి తలిదండ్రులతో గతరాత్రి తనకు ఒక కల వచ్చిందనీ, ఆ కలలో ఒక కుక్క, ఒక సిపాయీ కనపడ్డారనీ, ఆ సిపాయి తన చేయి పట్టుకొన్నాడనీ చెప్పింది.

"ఓహో, ఇది తమాషాగా వుంది. నిజం తేల్చుకోవాలి" అనిచెప్పి రాణీ ఒక ముసలిదానిని రాజకుమారిగదికి కాపలాపెట్టింది.

రెండవరోజున మళ్ళీ ఒకసారి రాజకుమారిని చూడాలని మన సిపాయికి బుద్ధి పుట్టింది. ఇవాళకూడా కుక్క వచ్చి రాజకుమారిని తీసుకుపోబోయింది. ఐతే దాని జాడ కనిపెట్టిన ముసలిది, ఆ కుక్క వెంబడే వెళ్ళి, సిపాయి ఇంటి తలుపుమీద సుద్దముక్కతో ఆనవాలు పెట్టి, ఈసంగతి రాజుగారితో చెప్పింది.

మరునాడు ఆ యిల్లు పట్టుకుందామని రాజూ, రాణీ స్వయంగా పరివారంతోసహా వచ్చారు. కాని, ఆ బజారునవున్న ఇళ్లన్నిటిపయినా ఒకే మోస్తరుగా ఆనవాళ్లు వున్నై. రాజకుమారిని ఎత్తుకు వచ్చిన కుక్కే యిలా చేసింది అందువల్ల అసలుఇల్లు వారు కనిపెట్టలేకపోయారు.

అప్పుడు రాణిగారు ఒక ఉపాయం చేసింది: ఒక సిల్కుసంచీ కుట్టి, దాని నిండా పిండిపోసి, రాజకుమారికి తెలియకుండా ఆమె మెడలో కట్టి వుంచింది.

మూడవరోజున మళ్లీ కుక్క వచ్చి రాజకుమారిని వీపుమీద ఎక్కించుకొని, సిపాయివద్దకు తీసుకుపోయింది. రాణీ కట్టిన పిండిసంచికి అడుగున చిన్న చిల్లి ఉండటంవల్ల దారి పొడుగునా ఆ పిండి రాలింది. ఈ సంగతి కుక్కకు తెలియదు.

సంచిలో పిండి కింద రాలినందువల్ల రాజూ రాణీలకు ఈసారి సులువుగా ఇల్లు అనవాలు దొరికింది. అప్పుడు సిపాయిని వెంటనే పట్టించి, ఉరి తీయమని అజ్ఞాపించారు.

ఆ మరునాడు జెయిలు కావలావాడు వచ్చి "రేపు రాజుగారు నిన్ను ఉరితీస్తారు" అని సిపాయితో చెప్పాడు. సిపాయికి ఏమీ తోచలేదు. చెకుముకిరాయి బసలో మరిచి పోయి వచ్చానే అని విచారించాడు.

సిపాయిని ఉరితీసే రోజు వచ్చింది. జైలుకటకటాలలోంచి చూసేసరికి, ఉరిశిక్ష పొందబోయే తనను చూడటానికి జనం గుంపులు గుంపులుగా పోవటం కనపడింది.



అందులో ఒక పిల్లవాడు ఉరితీసే చోటికి పరుగెత్తి పోతూవుండగా, వాడి కాలి జోడు ఒకటి వూడిపోయింది. వానిని సిపాయి పిలిచి, "ఓరి కుర్రవాడా! ఎందుకంత తొందర! నన్నేకద వురి తీసేది. నేను వెళ్ళనిదే అక్కడ జరగబోయే తమాషా ఏమున్నది! కనుక నాకు ఒక చిన్న పని చేసిపెట్టు, నీకు ఒక రూపాయి బహుమతి ఇస్తాను" అన్నాడు.

కుర్రవాడు సంతోషంతో వప్పుకొనే వరకు సిపాయి, తన ఇల్లు అనవాలు చెప్పి, అక్కడవున్న చెకుముకిరాయి తెచ్చి పెట్టమన్నాడు.

నిమిషంలో ఆ కుర్రవాడు చెకుముకి రాయి తెచ్చి ఇచ్చి బహుమతి తీసుకుపోయాడు.

ఉరితీసేవేళకు జనం అపరిమితంగా మూగారు. సిపాయి మెడకు ఉరితాడు తగిలించగానే, చచ్చిపోయే ముందు తన కొక కోరిక ఉన్నదని అతను రాజు గారితో మనవి చేశాడు: "ఏమీ లేదు. మహాప్రభూ! ఒక్క చుట్ట కాల్చుకుందా మని కోరిక వున్నది. తీరగానే మీరు నన్ను ఉరితీయవచ్చును." అన్నాడు.

"ఇదేమంత భాగ్యం. చిన్న కోరికేకదా!" అని రాజుగారు సరేనన్నారు.

అప్పుడు సిపాయి చెకుముకి రాయి తీసి నేలమీద అరుసార్లు కొట్టేసరికి, భయంకర మైన మూడు కుక్కలూ—బంతులంతేసి కళ్లు కలది, బండి చక్రాలంతేసి కళ్లు కలదీ, గుడిగోపురాలంతేసి కళ్లు కలదీ, ప్రత్యక్షమయినాయి.

సిపాయి, సంజ్ఞ చేసేసరికల్లా మూడు కుక్కలూ ఎగిరి అక్కడి పెద్దలందరనూ పిక్క పట్టుకొన నారంభించినై. జనం ఎక్కడి వాళ్లు అక్కడనే హడిలి పారిపోయారు.

రాజుగారికికూడా భయం పట్టుకొన్నది. "వోయి, సిపాయీ! నీకు పుణ్యముం టుంది, నీ కుక్కలను దగ్గిరకు పిలుచు కోని, కట్టేసెయ్యి. ఇదుగో ఇప్పుడే మా అమ్మాయిని నీకు పెళ్లిచేసి, నా రాజ్యం నీ కిస్తున్నాను" అని బతిమలాడేవరకు సిపాయి వాటిని మాయంచేశాడు.

అప్పుడు రాజుగారు అతనిని గుర్రపు బగ్గీలో తీసుకువెళ్లి, రాజకుమారిని ఇచ్చి అతివైభవంగా పెళ్లి చేశారు.

రాజుగారు కుమార్తెను కంచుకోటలో దాచి కాపలా పెట్టినప్పటికీ బ్రహ్మ రాసిన గీటుప్రకారం ఆమెను సిపాయికి పెళ్లి చేయక తప్పిందికాదు.






పూర్వకాలమందు ఒక రాజు ఉండే వాడు. ఆయన ఉత్త చూపులబొమ్మే కాని, పొట్ట చించినా అక్షరంముక్క రాదు. ఆ మాటకు వస్తే, సామాన్య మానవుడికి ఉండేపాటి తెలివితేటలయినా లేవు. పైగా ఆయనకు ఎంత తోస్తే అంతేగాని, బ్రహ్మ రుద్రుడు వచ్చి చెప్పినా వినిపించుకోని మూర్ఖుడు. ఇటువంటివానితో ఎలా వేగడం?

ఒకనాడు ఆ రాజు వేటకు వెళ్లేసరికి, అడవిలో ఒక పెద్ద కోతి కనపడింది. అది బాగా మనిషంత ఎత్తున ఉన్నది. సరీగా మనిషిలాగానే నిలుచున్నది కూడాను.

ఆ కోతి అడుగులు వేసుకొంటూ, అటూ యిటూ నడుస్తూవుంటే, రాజు దానివేపు చోద్యంగా చూడసాగాడు. అలా చూచిన కొద్దీ ఆయనకు దానిపయిన మక్కువ ఎక్కువై, చివరకు "ఇటువంటి వింత జంతువు మన సంస్థానంలో లేకపోవడ మేమిటి?" అనికూడా అనిపించింది.

"వెంటనే దానిని పట్టుకొనం"డని భటులకు ఆజ్ఞాపించాడు. 'ఇదేమిటి, రాజుకి మతి పోయిందా ఏమిటి! పౌరుషానికైతే పులిని పట్టాలి. విందుకయితే లేడినో అడవి పందినో కొట్టాలి. అంతేకాని, కోతిని పట్టుకోవడ మేమిటి విడ్డూరం. ఎక్కడా కన లేదు, వినలేదు' అని వేటగాళ్లందరూ చాటున అనుకున్నారు. కాని, అనుకొని లాభ మేమున్నది! రాజు అజ్ఞ దాటడానికి వీలులేదాయె. ఆయన ఇష్టప్రకారం ఆ కోతినిపట్టి, కోటకు తీసుకుపోయారు.

నగరం చేరుకోగానే రాజు తన మంత్రిని రప్పించి, "ఓయిమంత్రీ! ఇతను ఎవరనుకొంటున్నావు? నరుడిని మించిన వానరుడు. ఆ కాళ్ల పొంకం చూడు, కండపుష్టి చూడు. మనిషికీ అతనికీ తేడా

పాలంకి వెంకటరామచంద్రమూర్తి – మదరాసు.



యేమున్నది? మనిషికి ఉన్నంత నేర్పూ అతనికీ ఉన్నట్టే కనపడుతున్నాడు. కనుక, ఇతనిని మన తాలింఖానాకు పంపించి, కుస్తీ, కత్తిసాము కసరత్తు మొదలయిన సమస్త విద్యలలోనూ తరిఫీదు ఇప్పించినట్టయితే గొప్ప వస్తాదు అవుతాడు. ఇటువంటి గొప్ప వస్తాదు సంస్థానంలో ఉన్నాడంటే మనకు ఎంతో కీర్తి వస్తుంది" అంటూ ఉత్సాహంతో చెప్పాడు.

రాజు చెప్పినది విన్నతరవాత మంత్రి "మహాప్రభూ! తమరు సెలవిచ్చినదంతా బాగానే వున్నది. అయితే, కుక్క బుద్ధీ కోతి బుద్ధీ నిలకడగా ఉండవంటారు పెద్దలు. అటువంటప్పుడు మన కోతికి సాము నేర్పించి, కత్తులూ కటార్లూ చేతికి ఇస్తే మరేమయినా వున్నదా? అదంతా చాలా ప్రమాదం; కనుక, మన వానర శిఖామణిని వినోదంకోసం జంతుశాలలో వుంచితే అందరూ చూచి ఆనందిస్తారు. కనుక అలా చేయడం మంచిదని నా అభిప్రాయం" అని మనవి చేశాడు.

మూర్ఖుడయిన రాజుకి మంత్రి మాటలు చెవికి ఎక్కనేలేదు. తన ఆజ్ఞ నెరవేరి తీరాలని మళ్లీ నొక్కి చెప్పాడు. చేసేది లేక మంత్రి, ద్రోణుడిని మించిన ఒక ప్రవీణుడిని నియమించి, కోతికి సమస్త విద్యలూ నేర్పించాడు. ఆ విద్యలన్నీ దానికి ఇట్టే వచ్చేశాయి.

ఇలా ఉండగా, వానరశిఖామణికి విద్య ఎంతవరకు వచ్చిందో పరీక్ష చేయాలని ఒకరోజున రాజుగారికి సరదా పుట్టింది. పరీక్షకు అవసరమయిన ఏర్పాటు లన్నీ జరిగాయి. దర్బారు కిటకిటలాడుతున్నది. 'అయ్యా, ఆచార్యులవారూ! మీ శిష్యుని విద్యాకౌశలము ప్రదర్శించమనండి, చూదాం' అన్నారు రాజుగారు.

అప్పుడు గురువుగారు ఒక చెట్టుమీది పిట్టను కోతికి చూపించి, దానిని కొట్టి రమ్మని సంజ్ఞ చేశారు. గురువుగారి ఆజ్ఞ శిరసావహించి, సభలో వానరుడు అందరకూ ఆశ్చర్యం కలిగేటట్టుగా ఒరలో నించి చర్రున కత్తి దూసి, చెట్టుపైకంటా పరుగెత్తి పోయి, పక్షి తల నరికి పారవేశాడు. పక్షి, తలకు తల, మొండెముకు మొండెమూ కిందపడిపోయేసరికి, వానరుని చాకచక్యానికి అందరూ 'భేష్! భేష్' మంటూ చప్పట్లు కొట్టారు. ఇక రాజుగారు ఆనందం పట్టనే లేక పోయారు. 'గమనించావా మన వానరుని నేర్పు!' అన్నట్టుగా ఆయన మంత్రివేపు ఒక్క చూపు విసిరాడు. సమాధానం చెప్పటానికి అది సమయం కాదని, మంత్రి అప్పటికి ఊరుకొన్నాడు.

మరునాడు మహారాజావారు వానర శిఖామణికి అఖండమైన సన్మానం జరపదలచి, విలవయిన దుస్తులతో ముస్తాబు చేయించారు. తమ మెడలోని రత్నహారాన్ని తీసి నిండుసభలో, స్వయంగా వానరవీరుని మెడకు అలంకరించారు. ఆఖరున ఆయన లేచి, "ఈ వీరాగ్రేసరుణ్ణి



మా 'అంగరక్షకుని'గా ఏర్పరిచి గౌరవిస్తున్నాము" అని సభలో ప్రకటించారు.

రాజు చేష్టలకు దర్బారులో అందరూ ముక్కుమీద వేలేసుకొన్నారు.

ప్రభువు విననీ, వినకపోనీ, తన విధి తను నెరవేర్చుకోవాలనే నిశ్చయంతో మళ్లీ మంత్రి వెళ్లి "మహారాజా! 'అంగరక్షకు' డనగా అదెంతటి గొప్ప పదవి! ఎల్లప్పుడూ, కూడా వుండి, ఎట్టి ఆపదలూ రాకుండా యజమానిని రక్షించాలి కదా! ఏలినవారి దర్శనానికి వచ్చేవారిలో ఎవళ్లు మంచివాళ్లో ఎవళ్లు దుర్మార్గులో తెలుసుకొనే తెలివితేట లుండవద్దా? అంత జ్ఞానం



కోతికి ఎక్కడినించి వస్తుంది? కనుక, మన వానరుని నేర్పు చూసి వినోదించ వలసిందే కాని, వానికి అంగరక్షకుని పదవి ఈయటం ఎంతయినా హానికరము" అని రాజుతో తన మనస్సు వెల్లడించాడు.

ఇంత చెప్పినా, ఈ సలహాలు ఏమీ రాజు తలకు ఎక్కలేదు. 'సరే, మన కేమి!' అని చెప్పి మంత్రి వెళ్లిపోయాడు. నలుగురు కాదన్నకొద్దీ రాజుకి కోతిపయిన మోజు మరీ ఎక్కువవుతూ వచ్చింది. ఆయన ఎక్కడికి వెళ్లినా తమ ఆస్థానపు వానర వీరునిచేత కసరత్తు చేయించి, కత్తిసాము చేయించి, ఎంతో గొప్పగా అతనిని పొగ డుతూ వుండేవాడు. ఇటువంటి 'అంగరక్షకుని' నియమించుకున్నందుకు, రాజును అందరూ మెచ్చుకొనేవారు.

ఇలా ఉండగా రాజుగారి పుట్టిన రోజు పండగ వచ్చింది. ఆ పండగకు అందరూ అపరూపమయిన కానుకలు సమర్పించారు. అందులో ఒక పువ్వుల వర్తకుడు ఒకడు బహుమానంగా తెచ్చిన పూల మాలిక చాలా అందముగా వుండటమే గాక, పరిమళంతో సభంతా గుమగుమ లాడిపోయింది. అందుచేత ఆ మాలికను రాజుగారు మెడలోనించి బయటకు తీయనేలేదు.

ఆ పండగరోజున జరిగిన ఉత్సవాలతోను, వేడుకలతోను రాజుగారికి అలసట కలిగి, పెందరాళే నిద్ర వచ్చేసింది. అందుచేత 'కాస్సేపు పడుకొంటాను. నువు గుమ్మందగ్గిర కాపలా ఉండు. ఎవ్వరినీ లోపలికి రానీయకు' అని అంగరక్షకుడైన వానర వీరునితో చెప్పి, ఆయన మెడలో పూలమాలిక తీయకుండానే హంస తూలికాతల్పం పయిన నిద్రపోయారు.

రాజాజ్ఞప్రకారం అంగరక్షకుడు వేయి కన్నులతో కాపలా కాస్తున్నాడు. రాజు

నిద్రపోతున్నప్పుడు ఎవ్వరూ లోపలకు రాలేదు. అయితే ఆ పువ్వుల పరిమళానికి ఎక్కడినించో ఒక తుమ్మెదమాత్రం 'ఝుం ఝుం' మ్మని రొద చేసుకొంటూ అక్కడికి వచ్చింది.

అంగరక్షకుడు ఆ తుమ్మెదను అనేక విధాల అటకాయించాడు. కాని అది ఎలాగో తప్పించుకుపోయి, రాజుగారి మెడలోవున్న పూలదండమీద వాలింది.

పౌరుషవంతుడయిన వానరవీరునికి తుమ్మెదపైన చాలా కోపం వచ్చేసింది. 'హత్తేరీ! నేనిక్కడ కాపలా ఉండగా, నువు గదిలో ప్రవేశించటానికి ఎన్ని గుండెలుండాలె? రాజాజ్ఞ అంటే ఏమిటి అనుకొన్నావు!'' అంటూ, వాయువేగంతో వెళ్లి, పూలదండమీద వాలిన తుమ్మెదను తన ఖడ్గంతో రెండు ముక్కలుగా నరికివేశాడు.

తుమ్మెదతోపాటు అంగరక్షకుని కత్తి దెబ్బకు రాజుగారి కంఠంకూడా తెగి రెండు ముక్కలయింది!! హంసతూలికా తల్పమంతా రక్తమయమైపోయింది!!!

రాజాజ్ఞప్రకారము మన వానరుడు గది గుమ్మంవద్ద కాపలా కాస్తున్నాననే సంతో




షిస్తున్నాడు కాని, తన బుద్ధితక్కువవల్ల యజమాని ప్రాణమే పోయిందన్న సంగతి గుర్తించలేదు.

తీరా, రాజుకి ప్రాణం పోయిందాయె. ఇక ఇప్పుడు ఎవరుమాత్రం ఏమి చేయగలరు? చేస్తేమాత్రం, చచ్చినరాజు తిరిగి వస్తాడా! అందుకనే, ఎప్పుడయినా నలుగురు చెప్పినదారిని నడుచుకోవాలి గాని, మూర్ఖత పనికిరాదు. 'అలా కాదు, నా యిష్టంవచ్చినట్టే చేస్తాను, ఒకళ్లు నాకు చెప్పేదేమిటి?' అని గర్విస్తే, రాజుకిఐనట్టే శాస్తి అవుతుంది. కనుక మీరు రాజుకిమల్లే మూర్ఖంగా పట్టు పట్టకండేం.




అనగననగా ఒక దేశాన్ని ఒక ఫాదుషా పాలిస్తూ ఉండేవాడు. ఆయనకు ఒక తెలివయిన మంత్రి కావలసి వచ్చాడు. రాజ్యమంతటా చాటింపు వేయించగా, ఎంతో మంది వచ్చారు. వచ్చినవాళ్ల నందరనీ ఫాదుషా పరీక్షకు పెట్టాడు. కాని ఒక్కళ్లూ పరీక్షలో నెగ్గలేకపోయారు.

చివరకు ఒక ముల్లా, ఒక మార్వాడీ మిగిలారు. "సరే, మీ ఇద్దరనూ పరీక్షకు పెడతాము. ఎవరు నెగ్గితే వాళ్ళకు మా రాజ్యలో మంత్రిపదవి ఇస్తాము" అని వారితో ఫాదుషా చెప్పాడు.

మరునాడు—ఫాదుషా రెండు బుట్టలు తెప్పించి, ఒక్కొక్క బుట్టలో యాభైయ్యేసి చొప్పున చక్కిలాలు సర్దించి, వాటిని పక్క ఊరిలో వున్న తన కూతుళ్లకు ఇచ్చిరమ్మని ముల్లానూ మార్వాడీనీ పంపించాడు.

ఫాదుషా అజ్ఞ ప్రకారం, చక్కిలాల బుట్టలను పొరుగూరిలో ఇచ్చేసి, సాయంత్రానికి ఇద్దరూ తిరిగివచ్చారు. ముల్లా తీసుకువచ్చిన రశీదులో నలభై అయిదు చక్కిలాలు మాత్రమే చేరినట్లు వ్రాయబడి ఉన్నది.

'తక్కిన ఐదూ ఏమైనవయ్యా?' అని ఫాదుషా ప్రశ్నించాడు.

అందుకు, ముల్లా "మహాప్రభూ! క్షమించాలి. మధ్య దారిలో ఆకలివేసింది. అందుకని అయిదు చక్కిలాలు నేను తిని వేసినమాట నిజమే" అని తను చేసిన తప్పును ఒప్పుకొన్నాడు.

అప్పుడు ఫాదుషా ముల్లా అవివేకానికీ, అమాయకత్వానికీ లోపల నవ్వుకొని, 'యుక్తి తెలియని ఈ వాజమ్మ మంత్రి పదవి ఎలా నిర్వహించగలడు?' అనుకొన్నాడు.

— రాళ్ళబండి సీతామహలక్ష్మి, బందరు



తరువాత మార్వాడీవేపు తిరిగి, "మరి, నీకు మాత్రం దారిలో ఆకలి వేయలేదా? దూరపు ప్రయాణంకద?" అని అడిగాడు.

అందుకు మార్వాడీ, "వేయ కే మి దేవరా! మానవజన్మ ఎత్తిన ప్రతివాళ్లకూ ఆకలి వేస్తుంది. నన్ను ఇచ్చిరమ్మనిన చక్కలాలలో నేనూ కొన్నితిని ఆకలి తీర్చు కొన్నాను. అయితే, ఒక్కొకదానికి జాగ్ర త్తగా అంచులు చిదిపి తినటంచేత, స్వరూపాలు చిన్నవయినవి గాని లెక్కకు తగ్గలేదు. తప్పనిసరిగా ఈ పని చేయవలసి వచ్చింది. ఇందుకు ఏలినవారు మరొక విధంగా అనుకొనరని తలుస్తాను" అంటూ, తను చేసిన తప్పను ఎంతో యుక్తి గానూ, వినయంగానూ చెప్పి సమర్థించు కొన్నాడు.

ఇది వినగానే ఫాదుషా మనస్సులో చాలా సంతోషించాడు.

ఇద్దరిలోనూ వుండే తెలివితేటలు ఇప్పుడు ఫాదుషాకు తెలిసివచ్చినయి. ఈసారి వాళ్ళను మరివక పరీక్షకు పెట్టి చూస్తామన్నాడు. వాళ్ళకు తెలియకుండా రెండు సంచీలలో బూడిద వేయించి. వాటిని పొరుగు నవాబులకు ఇచ్చిరమ్మని ఇద్దరనూ పంపించాడు.

'ఇది ఒక అర్థంలేని పనిగా పైకి కనబడుతున్నది, కాని బుద్ధిబలం కలవానికీ, ఆలోచన లేనివానికి ఉండే తేడాను కనిపెట్టటానికి ఇది తగిన పరీక్ష' అని నిశ్చయించాడు.

ముల్లా వెళ్లి ఫాదుషాయిచ్చిన సంచిని నవాబుగారికి సమర్పించాడు. ఆయన విప్పిచూచి. "ఏమయ్యా, ఇదేమిటి బూడిద తీసుకువచ్చావు, అర్థంలేకుండా? నీకేమయినా పిచ్చెత్తిందా?" అని కోపగించాడు.

ముల్లా హడలిపోతూ, "మహరాజా! ఫాదుషావారు ఇచ్చి రమ్మన్నారు, తీసుకు వచ్చాను. అంతేకాని, సంచీలో ఏమున్నదో నాకేమి తెలుసునండి?" అని అన్నాడు.

అప్పుడు రాజుగారు, "ఇందులో ఏదో విలవయిన వస్తువు పెట్టి ఫాదుషా పంపి వుంటాడు. వీడు దానిని కాజేసి ఈ బూడిద పోసుకొని వచ్చాడు" అని అనుమానపడి, ముల్లాను అవమానించి, పరాభవించి పొమ్మన్నారు.

మార్వాడీ కూడా తనకిచ్చిన సంచిని తీసుకుపోయి ఇంకో నవాబుగారికి సమర్పించాడు. అందులో ఏమున్నదో మొదట అతనికి తెలియదు.

సంచీ విప్పగానే ఈ నవాబుగారుకూడా అతనివేపు మిర్రిచూచి, "ఇదేమిటయ్యా బూడిద పట్టుకొచ్చావ్? ఇదేనా మీపాదుషా గారు నాకు పంపిన కానుక?" అన్నారు.

యుక్తిపరుడయిన మార్వాడీ పరిస్థితులు ఆలోచించి "ప్రభూ! మా ఫాదుషావారు ఈ మధ్యనే మక్కాయాత్ర సేవించుకు వచ్చారండి. అక్కడినించి తెచ్చిన పవిత్ర భస్మాన్ని ప్రత్యేకించి ఏలినవారికి ప్రసాదంగా పంపించారండి," అనిఎంతో నమ్మకంగా చెప్పాడు.

నవాబు అపరిమితంగా సంతోషించి, ఫాదుషా తరఫున మార్వాడీని ఎన్నోవిధాల గౌరవించి, కానుకలిచ్చి మర్యాదలతో సాగనంపాడు.

ముల్లా, మార్వాడీతిరిగివచ్చారు. నవాబు పంపిన కానుకలను మార్వాడీ ఫాదుషా వారికి సంతోషంతో అందజేశాడు. ముల్లా తెల్లముఖం వేసికొని, విచారంగా నిలబడ్డాడు. మరి, ఫాదుషా ఇద్దరిలో ఎవరిని మంత్రిగా చేసికొన్నాడో మీరే ఆలోచించి చెప్పండి!



# చందమామ పజిల్
(భాషాభివృద్ధికి)

## ఆధారములు

### అడ్డము-

4. నిత్యముకాని వసంతము (సమాసము)
5. దశకంఠుడు. (తెలుగు సమాసము)
6. రూపాయి. (రెండు మాటలు)




### నిలువు :

1. 800. (రెండు మాటలు)
2. బృహస్పతి. (రెండు మాటలు)
3. గొడుగులు. (సమాసము)

## ముగ్గులు



ఇ. ధనలక్ష్మి, మదరాసు



ఆర్. జానకి, సికంద్రాబాద్




# పిల్లల పెంపకం

## ధైర్యము

జీవితంలో మానవునికి ధైర్యమూ, స్వేచ్ఛా—ఇవి రెండూ ఎంతయినా అవసరం. చిన్నపిల్లలకు స్వభావసిద్ధంగా ధైర్యం వుంటుంది. ఆ ధైర్యాన్ని, సాధారణంగా మనము అణచివేయటానికి పూనుకొంటాము. ఇది పొరపాటు.

పిల్లలు తమ చేష్టలలో చూపించే చొరవనూ, ధైర్యాన్నీ ఎన్నడూ అరికట్ట టానికి యత్నించకూడదు. వాళ్లు ఏదయినా పని చేయబోయినప్పుడు 'నాయనా, చేయవోయి. నీకు వచ్చిన భయమేమీ లేదు. నేనిక్కడ ఉన్నానుగా!' అని హుషారివ్వాలి. వాళ్లు ఆ పనిలో మొదటిసారి జయము పొందలేకపోయినట్టయితే, "మళ్లీ చేయవోయి. ఈసారి తప్పక నెగ్గుతావు" అని వారి మనస్సుకి ఉత్సాహం కలిగించాలి. అంతే కాని, పిల్లలు చేసే కృత్యాలను అడుగడుగునా ఆటంక పరిచి, దిగదీయరాదు.

అయితే, పిల్లవానికి ప్రమాదం కలిగే సందర్భాలలో అతనిని వారించాలి. పిల్లవానికి ప్రమాదం కలిగిందంటే ఆ తప్పు పెద్దలదే. తరుణంలో మనం వాళ్లను హెచ్చరిస్తే, ప్రమాదాలెందుకు సంభవిస్తాయి? కనుక, పిల్లలకు ప్రమాదం కలగని విధంగా ప్రతిపనీ వాళ్లను స్వయంగా చేయనీయాలి.

స్వేచ్ఛగా ఉన్నప్పుడే మానవునికి ధైర్యం ఉంటుంది. ధైర్యం ఉన్నప్పుడే మానవుడు గొప్ప పనులు చేసి, మంచిపౌరుడు కాగలడు. ఈ సంగతి బాగా జ్ఞాపక ముంచుకోవాలి.

మీ పెద్దమ్మ




పైన వున్న తొమ్మిది పిట్టలూ అన్నీ ఒకేమాదిరిగా కనిపిస్తున్నా, నిజానికి అలాలేవు. తొమ్మిదింటిలో రెండుమాత్రమే ఒక్కమాదిరిగా వున్నై. ఆ రెండు ఏవే కనుక్కోండి. మీరు కనుక్కోలేకపోతే

జవాబుకి 53-వ పేజీ చూడండి.



# విజ్ఞానంలోని గమ్మత్తులు

నిజానికి మైలతుత్తంతో ఒక లక్ష తమాషాలయినా చేయవచ్చు. ఇప్పుడొక చిన్న చిత్రం చెబుతా, చూడండి :

ఒక చిన్న మైలతుత్తం ముక్క తీసుకువచ్చి గాజుగొట్టంలో పడవేయండి. గాజు గొట్టం కొంచెం వంపుగా పట్టి వేడి చేసినట్టయితే, గొట్టంపయిన చిన్న చిన్న బిందువులు ఏర్పడతాయి. తగినంత వేడి తగిలిన తరవాత, మైలతుత్తముకు క్రమంగా దాని నీలిరంగు పోయి, అది తెల్లగా మారిపోతుంది.

ఇంకొక వింత ఏమిటంటే — ఆ తెల్లగా మారిపోయిన పొడిని పైకి తీసి, దానికి కొంచెం నీరు చేర్చండి. మళ్లా దానికి ఎప్పటిలాగ మామూలు నీలిరంగు వచ్చేస్తుంది. ఈ మాజిక్కు అందరకూ ఆశ్చర్యాన్ని కలిగించదూ?

* * * *

ఇప్పుడు మరివక కొత్త వస్తువును గురించి చెప్పబోతున్నాను :

ఒక గాజుగొట్టంలో కొంచెం రససిందూరం వేసి, బాగా వేడి చేయండి. తరవాత ఒక అగ్గిపుల్ల వెలిగించి, మంట ఆరిపివేసి, ఆ గొట్టం మూతిదగ్గిర పెట్టినట్టయితే, అది కాంతితో మండుతుంది.

ఒక్కసారి ఆ గొట్టంయొక్క అంచులు చూడండి. తమాషాగా తళతళ మెరుస్తూ పాదరసపు అణువులు కనబడతాయి.

ఇప్పుడు చెప్పిన ప్రయోగాలు అన్నీ చేసేవారికీ చూసేవారికీకూడా తప్పక వినోదం కలిగిస్తాయి.

ఈసారి మరికొన్ని కొత్త చిత్రాలు చేద్దురుగాని.



ఈ చదరం పై మూలన వున్న కోట దగ్గరికి పోవటానికి సరియైన దోవ ఒక్కటే వుంది. ఆ దోవ ఏదో ఈ సిపాయికి చూపించి కోట చేర్చండి.

ప
జి
లు
కు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | 1 ఏ | | 2 దే | | 3 ఆ | |
| 4 అ | ని | త్య | వ | సం | త | ము |
| | మి | | త | | ప | |
| 5 ప | ది | త | ల | ల | వా | డు |
| | పం | | గు | | ర | |
| 6 ప | ద | హా | రు | అ | ణొ | లు |
| | లు | | వు | | లు | |

జ
వా
బు



51-వ పేజీలోని చిక్కు బొమ్మలకి జవాబు :
2, 8 నెంబర్లుగల పిట్టలు రెండూ ఒక్కమాదిరివి



# హిందీ మూడవ పాఠము

క్రిందటినెల హిందీ అక్షరాలు నేర్చుకొని, అవి ఎలా పలుకవలసినదీ, మాటలు ఎలా ఉచ్చరించవలసినదీ నేర్చుకున్నారు. ఈసారి 'క' గుణింతము నేర్చుకోండి.



'క' అనే అక్షరానికి ఈ పై గుణింతపు గుర్తులు యిలా చేర్చాలి.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| క | కా | కి | కీ | కు | కూ | కృ |
| क | का | कि | की | कु | कू | कृ |

| | | | | | |
|---|---|---|---|---|---|
| కే | కై | కో | కౌ | కం | కః |
| के | कै | को | कौ | कं | कः |

ఈవిధంగానే మిగతా అక్షరాలకు (ఖ, గ, ఘ మొదలైనవాటికి) పైన చూపిన గుణింతపు గుర్తులు చేర్చి వ్రాయటం నేర్చుకోండి.

ఉదాహరణకు ఈక్రింద కొన్ని అక్షరాల గుణింతాలు యిచ్చాను. అవి జాగ్రత్తగా నేర్చుకోండి.

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| च | चा | चि | ची | चु | चू | चृ | चे | चै | चो | चौ | चं | चः |
| ट | टा | टि | टी | टु | टू | टृ | टे | टै | टो | टौ | टं | टः |
| त | ता | ति | ती | तु | तू | तृ | ते | तै | तो | तौ | तं | तः |
| प | पा | पि | पी | पु | पू | पृ | पे | पै | पो | पौ | पं | पः |
| य | या | यि | यी | यु | यू | यृ | ये | यै | यो | यौ | यं | यः |
| र | रा | रि | री | रु | रू | | रे | रै | रो | रौ | रं | रः |

“र” అనే అక్షరానికి “ృ” అనే గుర్తు చేర్చకూడదు. అంతేగాక, ు (కొమ్ము.) ూ (కొమ్ముదీర్ఘం) గుర్తులు ఈ అక్షరానికి అడుగున చేర్చాలి. ఇది గుర్తుంచుకోండి.

ఈక్రింది మాటలను చదివి చూడండి.

| | | |
|---|---|---|
| घोडी | खेल | झटपट |
| कोठी | तेल | सरपट |
| रोटी | मेल | शरबत |
| मोती | मेज | कंसरत |

మొదటి వరసలోని నాలుగు మాటలలో ‘ఓత్వము ो’ దీర్ఘముగా పలకాలి. ఉ॥ घोडी అనే మాట ‘ఘోడీ’ అని పలకాలిగాని ‘ఘొడీ’ అని వలకకూడదు, అలాగే మిగత మూడు మాటలూ యింకా అలాంటి మాటలున్నూ. అలాగే రెండోవరుసలో యిచ్చిన నాలుగు మాటలలో ‘ఏత్వము े’ దీర్ఘంగా పలకాలి. ఉదా॥ खेल అనే మాటని ‘ఖేల్’ అని పలకాలిగాని ‘ఖెల్’ అని పలుకగూడదు. ఇలాగే మిగతా మూడు మాటలూ, ఇంకా అలాంటి మాటలున్నూ.

చివరి వరసలో యిచ్చిన మాటలు ఎలా పలకాలో చూడండి. झटपट అనే మాటలో రెండవ అక్షరం (ट) చివరి అక్షరం (ट) సగముమాత్రమే పలకాలి. అంటే ‘ఝట్‌పట్’ అని పలకాలిగాని ‘ఝటపట’ అని పలకగూడదు. ఇలాగే మిగతా మూడు మాటల్ని ‘సర్‌పట్’, ‘శర్‌బత్’, ‘కన్‌రత్’ అనీ పలకాలి.

వచ్చేనెల మరొక క్రొత్తపాఠం నేర్చుకొందురు గాని. ఈనెల చెప్పిన పాఠం శ్రద్ధగా చదివి గుర్తుంచుకోండి.



క్రిందటి నెల 'చెరువులో కొంగ' బొమ్మకి రంగులు వేశారుకదూ. ఇప్పుడు ఈ 'రెండు పాములు' బొమ్మకి ఏ రంగులు వేస్తే బాగుంటుందో ఆలోచించి ఆలా రంగులు వేయండి. మీరు రంగులువేసిన బొమ్మని వచ్చేనెల (జూలై) చందమామ అట్టమీదిబొమ్మతో పోల్చుకోండి.

Printed and Published by B. NAGI REDDI, at B. N. K. Press, 37, Acharappan Street, Madras
Editors: CHAKRAPANI and K. RAJA RAO.



Chandamama, June '49 — Photo by R. Krishnan

విరోధం

CHANDAMAMA (Telugu) JUNE 1949 Regd. No. M. 4854




కొంగజపం